వైజయంతిమాల · పద్మిని వీరిని

అత్యున్నత స్థాయిలో చూడండి

జెమినీ చిత్రం

# విజయకోట వీరుడు

..తెలుగు..

అక్టోబర్ **2** మొదలు ఆంధ్ర దేశ మంతటా......



# మహిళల ఆరోగ్య రక్షణకు

## మాదీఫల రసాయనము

ఇది ముదిరిన మాదీఫలముల రసముతో తయారు చేయబడినది. గర్భిణి స్త్రీలకు కలుగు వాంతులకు (వేవిళ్లు) యిది సంజీవివంటిది. తల తిరుగుడు, వాంతులు, అరోచకము, అజీర్ణము, మలబద్ధకము, నిద్రలేమి మొదలగు జబ్బులకు వజ్రాయుధము, జ్వరవేగమును తగ్గించుటలో యీ రసాయనము పేరుపొందినది. ఇది తేనెవలె యుండి నోటికి రుచిగను యింపుగను నుండును.

3 ఔన్సుల బుడ్డి రు. 1-25 న.పై.

## గర్భరక్షక

స్త్రీలు బలహీనులగుటచేత గర్భము ధరించిన పిమ్మట పెక్కు రుగ్మతల పాలగుచున్నారు. ముఖ్యముగ వీరలకు గర్భస్రావము, అకాల ప్రసవము, అప్పుడప్పుడు కడుపునొప్పి, నడుము నొప్పి, రక్తహీనము, శరీరమందు నీరుచేరుట, బలహీనము, అలసట, ఆయాసము, అజీర్తి, మలబద్ధకము మొదలగు జబ్బులు కలుగుచున్నవి. ఈ 'గర్భరక్షక' సేవించిన పై జబ్బులు రాకుండుటయే గాక ప్రసవించువరకును శరీరము మంచి ఆరోగ్యస్థితి గలిగియుండి నిండుమాసములు గర్భము ధరించి సుఖముగ ప్రసవించెదరు.

3 ఔ॥ రు. 3-10    6 ఔ॥ రు. 5-50

## క్షీరబలాతైలం

స్త్రీలకు బుతు దోషముచే గల్గు వాత వ్యాధులు, పార్శ్వపు తలనొప్పులు, తలపోటు, గర్భవాతము, శరీరము బలిసియుండుట, మూర్ఛ, అపస్మారవ్యాధులు, క్షయవ్యాధి, నరముల బలహీనత, యీ తైలముతో అభ్యంజన మొనర్చిన నివర్తించును.

6 ఔ॥ల బుడ్డి రు. 3-0

## సౌభాగ్యశొంఠి

### బాలింత లేహ్యము

ప్రసవానంతరమున స్త్రీలకు బాలింతకారమను ఒక ఘాటు ఔషధమును యిచ్చు ఆచారము మన దేశమున చిరకాలముగ నున్నది. అయితే ఈ కారమును లెక్కలేనన్ని పచారిదుకాణపు సామానులతో తయారుచేసి యిచ్చుచున్నారు. ఇందు కలియు వస్తువుల పరిమాణమును, పదార్థజ్ఞానమును పాటింపక మందును తయారు చేయుదురు. ఈ కారము వారికి వేడిచేసి అనేక రుగ్మతలు సంభవించుచున్నవి. ఈ సౌభాగ్య శొంఠిని వాడిన ఆరోగ్యము చెడక తల్లియు బిడ్డయు సుఖముగ నుండగలరు. తల్లికి సమృద్ధిగ పాలుపడును.

బుడ్డి రు. 2-0

## ప్రమేహాంతకం

### (తెల్లబట్ట వ్యాధికి)

అనేక కారణములవలన స్త్రీలకు గర్భాశయము నుండి తెల్లటిద్రవము వెడలుచుండును. స్త్రీ జాతి యందు యీ జబ్బు సర్వసాధారణముగ నుండును. పసిపిల్లలకుగూడ యీ వ్యాధి సంభవించుచున్నది. చిరకాలముగ యీ వ్యాధివల్ల బాధపడువారి గర్భాశయము పుండగును. అట్టివారికి మేహజ్వరము, దగ్గు, నిస్సత్తువ, సంతాన హీనత సంభవించును.

బుడ్డి రు. 4-0

## కేసరి కుటీరం ప్రైవేటు లిమిటెడ్

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు-14.

ఆంధ్ర ప్రదేశ్‌కు ఏజంట్లు :

శీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ - సికిందరాబాదు.

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను సంపాదించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

ప్రొప్రైటర్లు : కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.

ఆక్టింగు ఎడిటర్

సి. సి. పున్నయ్య

సంపుటము ౩౨] అక్టోబరు 1958 [సంచిక ౧౦

# విషయసూచిక






జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



# అవాంఛనీయములు



తూతుకుడి క్రైస్తవబిషప్ ఉపన్యసిస్తూ ప్రస్తుతము సంఘములోనున్న కులతత్వము, వరకట్నము రెండును దురాచారములన్నారు.

ఇవి రెండూ ప్రజల అభివృద్ధి అభ్యుదయాలను నిరోధించునవే. అయితే అవి రెండు నశించుటకు మానవునిలో ఏర్పడవలసిన పరివర్తనము చాల దొడ్డదిగా నుండవలెను.

అనాదిలో వృత్తుల ననుసరించి కులాలు ఏర్పడినవి. ఆయా కులాలకు నియమ నిర్బంధాలు ఏర్పడినవంటే ఏకులాని కాకులము తమ వృత్తిమీద దృష్టిని కేంద్రీకరించి శక్తివంచనలేకుండా పాటుపడి సంఘసౌభాగ్యాన్ని ప్రోత్సహించడానికని. కాని

క్రమంగా వృత్తుల నవలంబించుట కులాలవారీగా కాకపోగా విచక్షణ, ద్వేషములను రేకెత్తించడానికి యీ కులతత్వము వినియోగపడటం చాల శోచనీయము.

కులతత్వాల కతీతంగా వృత్తులవలంబించుటకు అనువుగా అవకాశాలు, విద్యా విజ్ఞానములు లభ్యమగుచున్నప్పుడు కులతత్వాలను పట్టుకొని ప్రాకులాడటం అవివేకం కాగలదు. శక్తిసామర్థ్యములు, యోగ్యతలు ప్రధానములై ఏవృత్తినైనా అవలంబించుట కవకాశములున్నప్పుడు జాతీయ సౌభాగ్యమునకు, సంఘశ్రేయస్సుకు అవసరమగు అన్ని వృత్తులు, వాని నవలంబించేవారు సమాన గౌరవ మర్యాదలకు పాత్రములు కావలసియున్నది. ఆ వాతావరణంలో సమరస సమైక్యతలను, పరస్పర సద్భావ సహకారములను పెంపుచేసుకొని దేశాన్ని, ప్రపంచాన్నికూడ శాంతి సౌభాగ్య నిలయములుగా ప్రజలు చేయవలసియున్నది. కులతత్వాలు నశించడానికని అసభ్యమైనభాష నుపయోగించడమో, వెఱ్ఱికేకలు వేయడమో, వ్రాతలు వ్రాయడమో ప్రజలలో పరస్పర ద్వేషాన్ని, స్పర్ధలను ప్రోత్సహించి శాంతి భద్రతలకు ముప్పము తెచ్చినట్లగునుకాని అభివృద్ధి అభ్యుదయాలను ప్రోత్సహించినట్లు కాజాలదు.

వరకట్నమును నిషేధిస్తూ ప్రభుత్వము చట్టమును రూపొందించినా పుచ్చుకునేవారు, యిచ్చేవారు కట్నముయొక్క వికృతరూపం సంఘంలో ప్రజల ఆర్థికదుస్థితి కెలా కారణమగుతున్నదో గుర్తించి వాస్తవికత కనుగుణ్యంగా సంఘశ్రేయస్సు నుద్దేశించకపోతే యీ దురాచారము అరికట్టబడలేదు.

మన దేశంలో కులతత్వవాదము, వరకట్నము ఎంత త్వరగా నశిస్తే అంత శ్రేయస్కరము. ఈ దురాచారాలు మటుమాయం కావడానికి ప్రభుత్వముకంటెకూడ ప్రజలు విజ్ఞతతో బాధ్యతాయుతంగా వ్యవహరించాలి.



# జానకి

శ్రీమతి చివుకుల లక్ష్మీపున్నయ్య

జానకి అత్తగారింట్లో జీవితమును గురించి తెలిసిన వారు ప్రతియొక్కరు 'అయ్యో పాపం!' అంటూ సానుభూతి చూపక మానరు. పుట్టింట్లో తను మూడవ ఆడబిడ్డ అయినా ఎంతో ఉల్లాసంగా, ఉత్సాహంగా యింటిల్లిపాదిని రంజింపజేస్తూ, మంచిగా నయితేనేమి, అఘాయిత్యంగా నయితేనేమి తన కోర్కెలను సాఫల్యంచేసికునేది. తెల్లగా పిండి బొమ్మలాగుండి, ముఖంపైన చిందులుత్రొక్కే ముంగురులతో, చిరునవ్వులు వెదజల్లే దొండపండు లాంటి పెదిమలతో, అమాయకత్వాన్ని, కొంటెతనాన్ని సమానంగా స్ఫురింపజేస్తున్న కనుదోయితో ఎంతో అందంగా, ప్రత్యేకమైన కళాకాంతులతో నుండే జానకి అత్తగారియింట్లో వాడిపోయిన ముఖం, నిస్పృహ నిరాశలతో క్రుంగిపోతున్న హృదయం, నల్లకప్పేసిన దేహచ్ఛాయ ఆమె రూపాన్నే కాకుండా వ్యక్తిత్వాన్నే మార్చేసినవి. దానికి కారణము అత్తగారిల్లు తినకుడువలేనిదై కాదు. ఇరవైయకరాల భూస్థితి, ధనం ధాన్యం సమృద్ధిగానున్న సంసారమే. ఆమె భర్త నెలకు నాలుగువందల రూపాయలు సంపాదిస్తున్న ఉద్యోగి. ఇదంతా చూచే ఆమె తండ్రి ఏరికోరి ఆ సంబంధాన్ని చేశాడు. అయితే ఏం! - నూతనంగా ఆడపిల్ల అత్తగారింటికి కాపరానికని పోతూ ఏసుఖసౌభాగ్యాలను ఆశిస్తూపోతుందో అవి మాత్రం కరువైనవి. ఆమెకు ఆ యింట్లో దక్కినవి యింటి వెట్టిచాకిరి. ఆ చాకిరైనా ప్రేమ, సద్భావముల వాతావరణములోవి కావు. ఎప్పుడూ అత్తగారి, ఆడబిడ్డల పురమాయింపులు, ఛీదరింపులు, చీవాట్లుంటుండేవి. భర్త తన ఉద్యోగమేమో — తనేమో — ఎక్కడెక్కడో తిరుగుతుండేవాడు; అప్పుడప్పుడు వస్తూపోతూండేవాడు. మామగారు వృద్ధులు. ఆయన కోడలిని ఆదరాభిమానములతో చూస్తున్నా ఆయన మాటను అత్తగారు, ఆడబడచులు లక్ష్యంచేసేవారుకారు. జానకి మాత్రం ఓపికగా తను ఎంతకష్టపడుతున్నా, సుఖమనేదిలేకపోయినా ఎట్టి పొరుపులేకుండా ఆ సంసారంలో కాలక్షేపంచేయ సాగింది. అన్నిటికంటె విచిత్రమేమిటంటే ప్రతి యువతి ఆశించే భర్తప్రేమానురాగాలుకాని, ఆదరణకాని, మంచిచెడ్డల విచారణకాని లేకపోవడం. అత్తగారు, ఆడబిడ్డలు యింట్లో ధాన్యం వగైరాలను చాటుమాటుగా అమ్ముకొని ఆదాచేసికుంటూ నగలు నాణ్యాలతో వినోదంగా విలాసంగా నుంటుంటే తన కనీసావసరాలనైనా గుర్తించేవారు ఆ యింట్లో లేకపోవడం ఆమెకు చాల బాధగా నుండేది. ఒక మూర పూవులు కొనుక్కోడానికి సయితము ఏనాడైనా పుట్టింటినుండి తల్లియో తండ్రియో నాలుగు రూపాయలు పంపేదానికి ఎదురుచూడాల్సివచ్చేది. ప్రొద్దస్తమానము యంత్రములాగ చాకిరితోనే సరిపోతుంటుందికాని ఉన్న చీరలయినా, ఒకటి, రెండు నగలైనా ధరించి ముచ్చట తీర్చుకోడానికి అవకాశాలుండేవికావు.

రాత్రింబగళ్లు యింత చాకిరిచేసి, వండి, వార్చి వేళకు పెడుతున్నా భర్తరాక అనిశ్చితం. ఆడబిడ్డల పురమాయింపులు మహాదొడ్డవి. ఆ యింట్లో ఎవరి ఆదరణ, సానుభూతిలేకపోగా కూరలో ఉప్పు ఎక్కువైందనో, కారంతక్కువైందనో, అన్నంచిమిడి ముద్దయిందనో ఆడిపోసుకుంటూ జానకి హృదయాన్ని గాయపరస్తుండేవారు. జానకి కాబట్టి ఆ వాతావరణంలో సరిపెట్టుకపోతున్నదికాని మరొకరు ఒక్కక్షణమైనా సహించలేరు. నెలకు ఒకసారి పుట్టింటి నుండి తన అన్నదమ్ములు చూడవచ్చి ఆమెపడే యాతనను చూచి బొటబొట నీరుకార్చేవారు; తల్లి క్రుంగిపోయేది. తన స్వంత సుఖమును, సౌభాగ్య

మును త్యాగంచేసి తన సంసారంపట్ల ఆసక్తిమాపడం ఆ యూళ్లో ప్రతియొక్కరిని చకితులను చేసేది.

జానకి భర్త రామారావు విద్యాధికుడే కాని ఉత్తమ సంస్కారముకాని, వాస్తవిక పరిజ్ఞానంగాని, హృదయలాలిత్యముకాని కలవాడుకాడు. తన జీతంలో మూడువందల రూపాయలు తల్లి చేతుల్లో పోసేవాడు. వందరూపాయలు తను ఖర్చుపెట్టుకుంటూ స్వేచ్ఛగా తిరిగేవాడు. తన భార్య యోగక్షేమాలుకాని, అవసరాలుకాని అతని దృష్టిలోనే యుండేవికావు. తన కష్టసుఖాలను గురించి చేసుకున్న భర్తతో నోరువిప్పిచెప్పడానికి అవకాశముండేదికాదు. ఇంట్లో యున్నంతసేపు తల్లి, ఆడబిడ్డలు అతనిని చుట్టుకొని చుట్టుకొని తిరిగేవారు. ఇల్లు బయలుదేరి వెళ్ళితే ఎప్పుడు వస్తాడో, ఎక్కడికి వెళ్ళుతాడో ఆమెకు తెలిసేదికాదు.

ఇలా నెలలు, సంవత్సరాలు దొర్లిపోతున్నవి. వాతావరణము మరింత వేడెక్కసాగింది. కూర్చొని తినమరిగిన అత్త, ఆడబిడ్డలు జానకిమీద మరింత పెత్తనం చలాయించసాగారు. అయినా యీనాటి కంటె రేపు మెరుగుగా నుంటుందనే ఆత్మవిశ్వాసమే జానకిని సజీవంగా నుంచుతున్నది. ఇంతలో రామారావుకు ఢిల్లీకి ఉద్యోగం ట్రాన్సఫర్ అయింది. అది వినేసరికి జానకి సంతోషపడింది. ఈ విధంగానైనా యీ పెను రొంపిలాంటి సంసారమునుండి బయటపడి భర్తతో సుఖంగా ఢిల్లీలో సంసారం చేయవచ్చుకదా యనుకుంది. కాని అలా జరుగకుండా అత్త, ఆడబిడ్డలు అడ్డం పడిపోయి, యిల్లువాకిలి చూచుకొని కాపురం పెట్టవచ్చులే అని చెప్పి రామారావును ఢిల్లీకి సాగనంపారు.

అసలే ముక్కిడి, ఆపైన పడిశం అన్నట్లు రామారావు పోవడంతో ఆడిపోసుకోడం, ఛీదరింపులల్లా జానకిపై దెబ్బలుగా మారినవి. అయినా ఆ యింట్లో తన ఏకాకితనాన్ని గుర్తించి, త్వరలో భర్తవచ్చి ఢిల్లీకి పిలుచుకొని వెళ్లుతాడుకదాయని ఓర్పుతో నాలుగు నెలలు ఎదురు చూచింది. కాని ఆ సూచనలు కనుపించలేదు. ఇక ఆ యమకూపంలో నుండటం ఆత్మవిధ్వంసకమనుకుంది. ఇల్లు బయలుదేరింది — ఎక్కడికో! — అత్త అడబడుచులు నిలవేసి అడిగారు ఎక్కడికని — చిరునవ్వుతో "నాకేం తెలియదు. కాని నేను పోయేచోటు యీ యింటికంటె మెరుగైందే. నేను చేయబోయే పని పుణ్యం, పురుషార్థముల సమకూర్చుకలది. నేను వెళ్లుతున్నాను..." అంటూ దూసుకొని వెళ్ళింది జానకి.

మరునాడు ఉదయం కుంపటి మూల కూర్చొని కునికిపాట్లు పడుతున్నది. అలమారలోని గిన్నెలు విశ్రాంతి ననుభవిస్తున్నవి. వేళతప్పకుండా కాఫీ, ఫలహారాలు, భోజనములారగిస్తూ యుండిన అత్త, ఆడబిడ్డలు పాచిపనిచేయడానికి, అంట్లు, చెంబులు తోమడానికి బయలుదేరక తప్పిందికాదు - తిని కూర్చొని సుఖపడ్డ జీవాలుకదూ !

జానకి పుట్టింటికి పోతుందని అనేకులు భ్రమపడ్డారు. కాని అది తన వ్యక్తిత్వానికి లోటని తెలుసుకున్న జానకి మరొక గ్రామం చేరింది. అక్కడ ఒక పూరిపాకలో పెద్దల సానుభూతి, సహకారాలతో చిన్న పాఠశాల పెట్టింది. అందులో బాలలకు విద్యావిజ్ఞానాలను ప్రబోధిస్తూ, సంగీతము నేర్పుతూ జీవయాత్ర సాగించడం మొదలు పెట్టింది. శ్రీ సాయిబాబా కరుణాకటాక్షములను మానవసేవకు తన జీవితాన్ని అంకితంచేసింది. ఆమెలోని పవిత్రత, విశ్వమానవప్రేమ, త్యాగసేవాసక్తి మహత్తరమైనవిగాను, ప్రజలకుపయుక్తముగా నయినవి.

మరి ఏనాటికైనా పిలుచుకొని పోవడానికని రామారావు జానకి దగ్గరకు వస్తాడేమో !

—X—

# రా జ కు మా ర్

ఫ్రెంచి మూలం :
అంటోని డె సయంట్-ఎక్సుపెరీ

తెలుగు అనువాదం :
డాక్టర్ వి. ఎన్. శర్మ



(గతసంచిక తరువాయి)

## అబ్బాయి చిత్రిస్తూవున్న దివ్యలోకం!

మా రాజకుమార్ ఈ లోక వాతావరణానికి కొత్తవాడని చెప్పటం అనవసరం కదూ! వాడికి మన మనోభావాలు ఎలా వింతగానున్నాయో, అలాగే వాడి మనోతత్త్వాన్ని అవగాహనం చేసుకోటానికి ప్రారంభంలో ఎంతో కష్టపడ్డానుకూడా! అబ్బాయి నా దగ్గరకు వచ్చి ఇప్పటికి నాలుగు రోజులకు పైగానే అయింది. వాడు నాతో చెపుతూవుండే కబుర్లమూలానా, వాడి ప్రపంచాన్నిగురించి క్రమేణ ఇంతో అంతో అవగాహనం చేసుకోటానికి ప్రయత్నించాననే చెప్పాలి!

నాలుగో రోజు వుదయాన అబ్బాయే సూర్యాస్తమయం సంగతి తన కబుర్లలో ప్రస్తావిస్తూ "సూర్యాస్తమయం అంటే నాకెంతో ఇష్టం. నా వెంట చప్పునవస్తివా ఆ దృశ్యాన్ని తనివితీరచూస్తూ ..." గుక్క తిప్పకుండా ఏమో చెప్పబోతున్నాడు.

"అంత తొందర పడితే ఎల్లా? అంతవరకు ఓపికపట్టి వుండాలిగా ...." అని వాడికి ఈ ప్రపంచసృష్టితో జవాబియ్యటానికి మొదలెట్టాను. వాడికి ఓపికపట్టటం అనేది వుంటేనా! ... నా మాటకు అడ్డు వస్తూ "ఎందుకలా ఓపికపట్టి వుండటం?" అని ఆత్రుతతో ప్రశ్నించాడు.

"ఎప్పుడంటే అప్పుడు సూర్యాస్తమయాన్ని చూడటానికి సాధ్యమవుతుందా? అంతవరకు కొంచెం ఓపిక పట్టి వుండాలిగా" అని అబ్బాయిని సమాధాన పరచటానికి అన్నాను.

ఆ మాట విన్నాడో లేదో తీవ్రదృష్టితో నాకేసి ఒకసారి చూశాడు. తరువాత ఏం అనుకున్నాడో చిరునవ్వు నవ్వుతూ "మా లోకంలో అలా ఓపికపట్టి వుండటం అనేది అవసరంలేదే" నాకేసి తదేకంగా చూస్తూ అన్నాడు.

అబ్బాయికి సూర్యాస్తమయం అంటే ఎందుకంత వుబలాటమో ఇప్పుడు నాకు అర్థమైంది. అమెరికా సంయుక్తరాష్ట్రాల్లో మిట్ట మధ్యాహ్నమైనప్పుడు, ఫ్రాన్సు

దేశంలో సూర్యుడు అస్తమించే కాలమనీ భూగోళ శాస్త్రంలో క్షుణ్ణంగా పాండిత్యం ఇంతో అంతో సంపాదించుకున్న వారందరికీ తెలిసిన సంగతే కదూ. అక్కడి సూర్యాస్తమం దృశ్యాన్ని చూసి ఆనందించ దలచిన వారు అమెరికానుంచి రెక్కల్ని కట్టుకుని వాయువేగ మనో వేగాలతో అక్కడికి నిమిషంలో చేరుకోవాలి. ఎంత వాయువేగ మనోవేగాలతో పరుగెత్తుకొని వెళ్లే విమానాలుకూడా ఆ కార్యాన్ని ఏరూపానా సాధించజాలవు. కారణం ఆ దేశాన్నుంచి ఈ దేశానికి రావాలంటే వేలకొలది మైళ్ల దూరం ప్రయాణం చెయ్యాలి. ఎంత తొందరగా వెళ్ళే విమానాలకయినా అధమం అర్ధరోజుకుపైగానే పడుతుంది ... ఇదంతా ఈ లోకపు గణిత శాస్త్రపు ప్రమాణాన్నిబట్టి చూస్తే! ఇంక వాడి లోకపు ప్రమాణాన్ని బట్టి చూస్తేనో? .. అబ్బాయి తన గ్రహమండలంలో కూర్చోటమే తరువాయి. అక్కడ నుంచి ఇక్కడికి చేరుకోటం అటునుంచి ఇటూకేసి అడుగుతీసి అడుగు పెట్టటం అంతేగా! వాడి గ్రహమండలపు గమనాన్ని అర్థంచేసుకోవాలి వాడి సంభాషణా పంధాను అవగాహనం చేసుకోటానికి. తన ఈ కోరికనుగురించే ఎన్నెన్నో కబుర్లు చెబుతూ "ఒక రోజున సూర్యాస్తమయాన్ని 43 సార్లు చూసి ఆనందించాను" అని యాదాలాపంగా అన్నాడు. అబ్బాయి దాంతో పూరకుండే ఘటం అయితేగా! "ఆ బాధా ఈ బాధా పడుతూవున్న వాళ్లకి ఈ అస్తమయాన్ని విధి విరామం లేకుండా చూడటమనేదే మంచి మందు. దాంతో వాళ్ల బాధలు ఇంక ఎందుకు వుంటాయి. నువ్వే చెప్పు ......" అని ఏదో అనబోతున్నాడు.

వాడి మాటకు అడ్డువస్తూ "ఒకరోజున 43 సార్లు అస్తమయ దృశ్యాన్ని చూశావంటే ఆరోజున నువ్వు ఎంతో బాధ పడుతూ వున్నావన్నమాటేకదూ?" అని సూటి ప్రశ్నని వాడిమీదికి విసిరేశాను. దానికి ఏంజవాబు చెప్పక అబ్బాయి తలవంచుకున్నాడు ... ఆ దృశ్యాన్ని చూసి వున్నవాళ్లకే, నా ప్రశ్న విన్నాక వాడి రూపం ఎందుకలా మారిపోయిందో అర్థమవుతుంది?

## 2

అబ్బాయి ఎన్ని కబుర్లు చెబుతూ ఆనందిస్తూవున్న వాడికోసం నేనుతయారు చేసి ఇచ్చిన మేక బొమ్మ వాడి చేతిలోనే వుండితీరాలి. ప్రాణంతోవున్న జంతువుకు మల్లె దాన్ని పదే పదే చూస్తూ దాని తిండీ తిప్పలు సంగతి ఆలోచిస్తూ వుండటమే వాడి దిన చర్యలో ముఖ్య ఘట్టం అయిపోయింది. అయిదో రోజు ప్రారంభమైందో లేదో, నాకు దగ్గరలో నేవున్న

ఆకూ అలాలని కోసుకునివచ్చి మే క కి పెడుతూ "చెట్లపొదల్నే అమాంతంగా మేకలుతిని వేస్తాయని అన్నావే, పూలను కూడా అవి రుచి చూస్తాయా?" అని నాకేసి తీవ్రంగాచూస్తూ అడిగాడు.

"అందుకు సందేహం ఏం వుంది? తిన టానికి ఏం కనబడితే దాన్నంతా చప్పున తినివేస్తాయి" అని అబ్బాయికి జవాబిచ్చాను.

"అంటే ముండ్లతో నిండివున్న పూలను కూడా తింటాయన్న మాటేనా ?"

"ఊ! ముళ్లు వున్న పూలనుకూడా తటపటాయించకుండా చ ప్పు న తి ని వేస్తాయి" అని అన్నాను.

దాంతో వాడి బుర్రలో ఏం తట్టిందో ఆ సమయాన "ఇంతకూ పూలకుముళ్లు ఎందుకు వుండాలి ?" అని ఒక క్రాసు ప్రశ్నను నా మీదికే అబ్బాయి చప్పున విసిరేశాడు.

ఆ సమయాన నా చేతినిండాపని. నా ప్లేను మరమ్మత్తు అంత సులభమైన పని అయితేగా ! ఇంజన్ రిపేర్ ఇంతో అంతో పూర్తి అయింది దానికి సంబంధించిన నీళ్లటాంక్ ఎంత చక్కచేసినా దోవలోకి వస్తేగా! ఆ మరచీలనితీసి ఇక్కడ వుంచాలి. దీన్ని తీసి అక్కడ అమర్చాలి. తదేకతతో ఆ పనిలోనే నిమగ్నుడ్ని అయివుండాలి. ఏ మాత్రం పొరబాటు జరిగిందా ఇంకేం వుంది ?...

అత్యవసరమైన ఈపని చూసుకోవాలా? లేక అబ్బాయి ప్రశ్నలకుజవాబియ్యాలా?ఏం తోచక వుక్కిరి బిక్కిరి అయిపోతున్నాను, కాని వాడికి ఇదంతా తెలుస్తుందా? పట్టు పట్టాడా వాడి ప్రశ్నలకు అంతూ పంతూ అనేది వుండేదికాదు.

"ఎందుకు అలా జవాబు చెప్పకుండా వుంటావు? ... ఇంతకూ ముళ్లు అంత అవ సరమా ఆ పూలకు?" అని ముఖం ఇంత పెద్దదిగా చేసుకుంటూ అడిగాడు.

అబ్బాయిని తృప్తిపరచటమా? అవ సరం; చేతిలోవున్న ఈ ముఖ్యమైన పనిని చూసుకోటం అంతకన్నా అవసరం. లేక పోతేనా ?..."ముళ్లువాటికి అవసరం లేదు. అయినా ముళ్లని నలుప్రక్కలా వాటి పనిని అవి చేసుకోటానికి పూలు అవకాశాన్ని ఇస్తాయి. అంతే" నా పనిమీదే దృష్టి నిగుడుస్తూ ఒక మాట అన్నాను.

"ఆ! అలాగా!" అని అబ్బాయి ఒక నిట్టూర్పు విడిచాడు. ఈ జవాబు వాడికి నచ్చినట్లు కనబడటంలేదు. అసలు సంగతి తెలుసుకోటమేగా వాడికి కావాలసింది!

"నువ్వు ఇచ్చిన సంజాయిషీ ఏమాత్రం బాగాలేదు. పూలు ప్రకృతి సహజంగా సున్నితమైనవి. వాటి వ్యక్తిత్వాన్ని నిలువ బెట్టుకోటానికి సర్వావస్థల్లో ప్రయత్నం చేస్తూవుంటాయి. ముళ్లు వాటి చుట్టూ వుంటే, ఇతర్లు ముట్టటానికి భయపడుతారు. ఒక విధంగా ఈ ముళ్లు వాటికి చేదోడు వాదోడుగా వుంటాయనే చెప్పవచ్చు..." అని ఆ సంగతి నాకు తెలుసుగా అనే ధోవలో అన్నాడు.

# ప్రకాశప్రభ కృతిసమర్పణ మహోత్సవము

——(౦)——

మద్రాసు - త్యాగరాయనగరు జాతీయ ప్రేమ మండలి ఆధ్వర్యాన కోటసోదరకవులు రచించిన ఆంధ్రకేసరి శ్రీ టంగుటూరి ప్రకాశంగారి సంగ్రహ జీవితచరిత్ర 'ప్రకాశప్రభ' పద్యకావ్యమును యీ నెల 6-వ తేది సాయంకాలము హిందీప్రచారసభ హాలులో కంపెనీలచట్టం సలహా సంఘం అధ్యక్షుడు శ్రీ తెన్నేటి విశ్వనాథంగారికి అంకితమిచ్చారు. ఈ కృతి సమర్పణ మహోత్సవమునకు శ్రీ స్వామి శివ శంకరులు అధ్యక్షత వహించిరి. బొడ్డుపల్లి సోదరీ మణులు (గుంటూరు) ప్రార్థన, శ్రీమతి రాధారాణి రాష్ట్రగీతాగానము చేసిన తరువాత జాతీయ ప్రేమ మండలి తరఫున గృహలక్ష్మి సంపాదకుడు శ్రీ సి. సి. పున్నయ్య స్వాగతము చెప్పుచు "శ్రీ ప్రకాశంగారి జీవితచరిత్రను కోటసోదరకవులు పద్యకావ్యముగా రచించిన 'ప్రకాశప్రభ'ను వారి శిష్యులు, అనుచరులైన శ్రీ తెన్నేటి విశ్వనాథంగారికి అంకితమివ్వడానికి యీ సమావేశము ఏర్పాటైనది. ప్రకాశం గారి జీవితం మీ కందరికీ తెలిసినదే. వారు ప్రతి క్షణము ప్రజల శ్రేయస్సుకొరకు ఆరాటపడుతూ సేవజేసిన త్యాగమూర్తి. వారి జీవితచరిత్ర, ఆదర్శ లక్ష్యాలు మార్గదర్శకమేగాక, ఆదర్శప్రాయమైనవని వేరే చెప్పనవసరము లేదు. వారిని చిరస్థాయిగా జ్ఞాపకముంచుకోడానికి వీలుగా కోటసోదరకవులు రచించారు కావ్యం. కష్టాలలోను, సుఖాలలోను గాంధీజీ శిష్యులుగా అధికారంలోను, బయటకూడ అభివృద్ధి అభ్యుదయాలకు గాంధీజీ సిద్ధాంతములు, బోధనలు శరణ్యమనినమ్మి వాని నమలుపరచ పూనుకొని కృషి సల్పిన ప్రజానాయకులు, దేశభక్తులు ప్రకాశంగారు, విశ్వనాథంగారూను. ప్రజలలో విద్యా విజ్ఞానాలు, పరస్పర సన్నిహిత సద్భావముల పెంపుచేయడానికి జాతీయ ప్రేమమండలి ఏర్పడినది. శ్రీ విశ్వనాథం గారు యీ సంస్థకు అండదండగా నుండటం మహా భాగ్యము. అనేక కారణములవలన జాతీయప్రేమ మండలి కొంతకాలము పనిచేయకపోయినా ఎప్పటి యట్లు ప్రజాసహకారంతో యికముందుకూడ కృషి చేయ దలచింది" అన్నారు.

శ్రీ స్వామి శివశంకరులు జాతీయ ప్రేమమండలి యీ కార్యక్రమమును ఏర్పాటుచేయడం బాగున్నదంటూ యిలా ఉపన్యసించిరి.

"ఈ మండలి లక్ష్యం ఉదాత్తమైనది. పేరు ముచ్చట అయిన పేరు. సంస్కృత సమానమైన హిందీభాషకు నిలయం ఇది. అందువలన పవిత్రస్థల మని నా అభిప్రాయం. ప్రేమమండలి సత్కార్యం చేస్తున్నందుకు నా అభినందన. అనేకమంది గ్రంథాలు వ్రాస్తున్నారు. అంకితం చేస్తున్నారు. ఓఢ్రభాషలో అంకితం అంటే ఒకరు వ్రాసిన గ్రంథాన్ని పూర్తిగా ఇంకొకరిపేరు పెట్టటం. మన ఆచారం వేరు. కోట సోదరులు రచించిన కావ్యం ఉత్తమమైంది. కావ్య వస్తువు ప్రశస్తమైనది. దానిని విశ్వనాథంగారికి అంకితం ఇవ్వటం అన్నిటికంటె సమంజసముగావుంది. శ్రీ విశ్వనాథం ప్రకాశంగారితో సరిసమానులు. వారి కోసం ఆయన ఎన్నో త్యాగాలుచేశారు. ఈ కావ్యాన్ని స్వీకరించటానికి వారికంటె ఉత్తమమైన వారు ఇంకొకరు వుండరు" అని స్వామి శివశంకరులు చెప్పారు.

అంతట కోట సోదరకవులు వేదోచ్చారణ, మంగళ వాయిద్యముల మధ్య శ్రీ విశ్వనాథంగారిని పుష్పమాలాలంకృతులనుచేసి, జరీవస్త్రములు కట్టబెట్టి తాము రచించిన 'ప్రకాశప్రభ' అనే కృతి కన్యను దానంచేశారు. శ్రీ విశ్వనాథంగారు కృతిని పరిగ్రహించి కృతికర్తలకు ప్రతిసన్మానం జరిపించారు.

తాము రచించిన పద్యకావ్యమును స్వీకరించటానికి అంగీకరించినందుకు శ్రీ విశ్వనాథంకు కృతజ్ఞతా పూర్వక అభివందనములు తెలిపి కోటసోదరకవులు తమ రచననుండి మచ్చుకు కొన్ని పద్యాలు చదివి వినిపించారు.

కావ్యంలో—

"దీటాకందును లేని దేశభక్తుడు కొండ,
వెంకటప్పయ్య పవిత్రశక్తి,
ప్రతిభగాంచిన ఆంధ్రరత్నము గోపాల

(553-వ పేజి చూడుడు)

# మేల్కొనుము, లెమ్ము, నిన్ను నీవు తెలిసికొనుము



**(శ్రీ స్వామి శివానంద 72 వ జన్మదిన సందేశము. ఆంధ్రానువాదము చేసినవారు 'శివానందపాదసేవక్' స్వామి శ్రీనివాసానంద సరస్వతి, శివానందనగరము, ఋషీకేశము)**

ప్రతిహృదయములోను దివ్యత్వపు మెఱుగు మిణుకు మిణుకుమనును. ప్రతిమనమున నౌన్నత్యమునకై నాశాకిరణము ప్రకాశించును. ప్రతియాత్మ (జీవి)లోను శాశ్వతశాంతి, పరిపూర్ణత విశ్వచైతన్యము, నిరంతరానందముల యొక్క పరంధామమగు తన స్వకీయ మూల స్థానమునకు వెనుదిరుగ దృఢకాంక్ష యుండును. అదియే నీ గమ్యము, నంతిమ లక్ష్యమై దాని నొందుటకే నీవీపృథ్విపై జన్మించితివి.

మానవుడు తన అదృష్టము (destiny) ను సృజించుకొనువాడు. నీ భావి నీచేతిలోనున్నది. ఆత్మ (జీవాత్మ) ఆత్మ (పరమాత్మ)చే నుద్ధరింపబడును. నీ ముందు రెండుమార్గములు – "ప్రేయోమార్గము" "శ్రేయోమార్గము" కలవు.

ఎవరైతే నీ పృథ్వికి కట్టుబడి జనన మరణములకు, రాగద్వేషములకు, సంతస విచారములకు (సుఖ, దుఃఖములకు) లోబడగోరుదురో వారు ప్రేయోమార్గము (యింపుగనుండునదేదియోనది) నెన్నుదురు. కాని సమస్తవస్తువులు తాత్కాలికమైనవి మఱియు నశాశ్వతమైన, అపరిపూర్ణమైన మూలమునుండి శాశ్వతమైన, పరిపూర్ణమైన ఫలితము నాశింప జాలరు. అందుచే ప్రాపంచిక వస్తువులు నీకు వాస్తవిక, కడతేరు (సుస్థిరమగు) శాంతి, సౌఖ్యములనీయజాలవు.

సరియగు జ్ఞానము, వివేచనగల మానవుడు "శ్రేయోమార్గము" (అభ్యుదయమైన దేదియోనది) మాత్రమే నొకనిని దుఃఖము, మరణపూరితమగు నీ ప్రపంచమునుండి యుద్ధరించి నిజమగు సుఖము, సంతోషముల నిట (యిహమున) నిటతదుపరి (పరమున)యు నింకను చుట్టుప్రక్కల జనులకు వాస్తవిక శ్రేయస్సును గొనితెచ్చునని నిశ్చితముగ నెఱుగును.

దేనినైతే నడచుటచే నొకడమృతత్వము (మోక్షము) నొందునో అట్టి శ్రేయోమార్గము సరిగ ప్రపంచముగుండను, దానిహద్దులకావల కొనసాగి యున్నది. దానిమార్గముగుండా పయనించుయాత్రికు లెవరన ప్రజాభ్యుదయమునకు జీవించుచు వ్యావహారిక జీవనపు లక్షణములు, నుదాహరణలనుండి తమ్ము తాము శిక్షణనొందుచు ప్రయోజనమొందువారే వారి యాదర్శ మాత్మానుభూతి (ఆత్మ సాక్షాత్కారము) యింకను ప్రపంచమువారికి నుపకరణములు, (Means) మాత్రమే కాని దానంతటది చరమలక్ష్యము కాదు. మండెడు జ్వాలవలెనుండు నాత్మ సాక్షాత్కారాదర్శము దుఃఖమూలము. ప్రాపంచికమునగు సమస్తమును దహించును. ప్రాపంచికతయొక్క త్యాగము, రాగద్వేషములు, మోహతృష్ణలనెడి దృఢప్రవాహముల స్వాధీనమొనర్చుకొనుట, నహంభావము, స్వార్థపరత్వములపై విజయమును, పరిపూర్ణతదరి యీ మహాయానమునకు ముఖ్యావసరములు.

సత్యవంతముగ నుండుము. అహింసామయముగ నుండుము. పవిత్రముగ నుండుము. మంచిగ నుండుము. మంచి నొనర్పుము. అసత్యము తుట్టతుదిని సాయమొనర్పదు. సత్యానుసరణ మాత్రమే నిజమగు మనశ్శాంతినొసగును. హింస (వైరిసంబంధ) ప్రతిక్రియను, నపవిత్రత రోగభూయిష్ట (morbid) విశ్రాంతిరహిత (చంచల) మనస్థితిని పెంపొందించును. ఆత్మసంయమ (self - control) రాహిత్యము బాధను, దుఃఖమును కలుగచేయ ప్రతి చెడుగును నతీతమైన స్వార్థపరత్వమునుండి మొలకెత్తును. కాన సత్యము, అహింస, పావిత్ర్యముల మార్గమే నత్యుత్తమ మార్గము.

నిన్ను నీ వెఱుగుము. నిన్ను నీవు పరిశీలించు

కొనుము. మనస్సును, మనోభావముల (emotions) నంతర్నిహిత కోరికల, తృష్ణల విమర్శించుకొమ్ము. మనఃపూర్వకత (నిజాయితీ) నీ జీవితములో మ్రోగుడు నాదముగ నుండనిమ్ము.

నీ ముఖ్యదైవిక స్వభావము ననుభూతినొందుటకు కాంక్షించుము. నీ సాధనను వృద్ధిపొందించుము. నీ జీవితమందలి ప్రతి క్షణమును పవిత్రత, సత్తమత (goodness) లలోనికి పెరుగ యత్నించుము. హృదయమును, మనస్సును పావనమొనర్చుము. అల్పతర (నీచ) స్వభావమును పరిశుద్ధమొనర్చుము. ఇచ్ఛను దృఢమొనర్చుము. ఆధ్యాత్మిక పంథాలో నుత్తమము, వాంఛనీయమగునదంతయు కృషిచేయుము. మనసును ద్వేషము, క్రోధము, కామము, అసూయనుండి విడదర్చి ప్రేమ, శాంతి, పవిత్రత, విరహా (వాంఛారాహిత్యము)లకు దాని ననుసంధించుము.

ఉత్తమజీవనమే సత్యోత్కృష్టమైన నాధ్యాత్మిక) జీవితము. దీనిని సదాజ్ఞప్తి యుంచుకొనుము. మంచిగ నుండుటయు, మంచి నొనర్చుటయు సత్యోన్నతమైన సాధన. ప్రకాశము నీలో నున్నది. మేల్కొనుము! లెమ్ము! తెరనుచింపి నిన్ను నీ వెఱుగుము!

భగవానుడు మిమ్ముల నందరిని ఆశీర్వదించుగాక!

---

"ఏమండీ! యింట్లోకూర్చొని డబ్బుచేసికోవచ్చని యీ పత్రికలో ప్రకటించారు చూచారా?" అన్నది ఒకావిడ భర్తతో

"చూశానుకాని - యింట్లోచేసిన డబ్బు చెల్లుతుందాయని అనుమానం"

♦ ♦ ♦

"అబ్బాయ్! మీ నాన్నగారింట్లో యున్నారా"

"లేరండీ"

"అదేమిటి అలాగంటావు! యిప్పుడేగదా మీ మేడగది కిటికీలోగుండా మీ నాన్నగారి తలకాయ కనుపించింది!"

"నిజమే - మా నాన్న యిలాగ బుర్రను యింట్లోయుంచి పోతూయుండటం చేతనే బయట అందరూ ఆయనకు బుర్ర లేదంటుంటారు"

♦ ♦ ♦

బీచిలో ముగ్గురు విద్యార్థినులు తమతమ జ్ఞాపకశక్తినిగురించి తర్కించుకొంటూ అందులో నొకామె తనకుగల అపార జ్ఞాపకశక్తినిగురించి వక్కాణించసాగి "నాకు చిన్నప్పటినుండి జ్ఞాపకశక్తి జాస్తి, అందులోను మూడు విషయాలలో - పేర్లొకటి, ముఖాలు రెండు, మూడవది ... సమయానికి గుర్తురావడంలేదే... ఛీఛీ!" అంటూ తలగోక్కోసాగింది.

అల్లంకి వెల్లారాం

# జ్ఞానోదయం

శ్రీ నాయుడు వెంకట సీతారామమూర్తి B. Sc.



ఒకప్పుడు వివేకానందస్వామి రాజస్థాన్ ప్రాంతాన్ని సందర్శించడం జరిగింది. ఆ దేశాన్ని పాలిస్తున్న 'ఆళ్వార్' మహారాజు మనస్తత్వం వివేకానందస్వామిని ఆశ్చర్యచకితుని చేసింది.

ఆళ్వార్ మహారాజు భోగలాలసుడు. భారతీయ సంస్కృతీ సాంప్రదాయాలను విడనాడి పాశ్చాత్య నాగరికతను అలవరచుకున్నాడు. విగ్రహారాధన అంటే యాతనికి గిట్టదు.

"భగవంతుడనే వాడుంటే మనస్సులో ధ్యానించి పూజించుకోవచ్చుగాని, నిర్జీవమైన రాతి విగ్రహాలను ఆరాధించడం కేవలం అవివేకం" అని వాదించేవాడు.

వివేకానందస్వామి యీతని విచిత్ర ప్రవృత్తిని గమనించి తగురీతిని గుణపాఠం నేర్పాలనే సంకల్పంతో రాజును సందర్శించేడు.

ఆళ్వార్ మహారాజు స్వామిని ఉచిత రీతిని సన్మానించేడు.

"రాజా! పరమేశ్వరుడు మిమ్ము సర్వదా కాపాడుగాక!" అంటూ ఒక చిన్న విగ్రహాన్ని అతని చేతికి అందివ్వబోయాడు.

రాజు స్వీకరించలేదు.

"క్షమించాలి నేను విగ్రహారాధకుణ్ణి కాను" అంటూ తన వ్యతిరేకతను వ్యక్త పరచేడు.

"అదేమిటి రాజా! దైవాన్ని నిందించడం దోషం కదూ?" అన్నాడు వివేకానందుడు.

"భగవంతుడనే వాడికి యిన్ని రూపాలు, యిన్ని వేషాలు ఎందుకు? సద్భావంతో మనస్సులోనే ఆ దైవాన్ని ఆరాధించుకోవచ్చు కానీ మధ్యలో యీ నిర్జీవమైన శిలా ప్రతిమ లెందుకు?"

"అక్కడే పొరపడుతున్నావు రాజా! ఎదుట ఏ వస్తువూ లేకుండా, దానిపై నిర్మల హృదయంతో మనస్సును లగ్నం చేయడానికి సాధ్యపడదు. కావుననే మధ్యగా భగవంతుని ఊహారూప ప్రతిమలపైనే దృష్టి కేంద్రీకరించి దైవాన్ని ఆరాధించుకుంటున్నాము. విగ్రహారాధనను కాదంటే దేవునినికూడా కాదన్నట్టే!" అని బోధించేరు. కానీ రాజు మనస్సు మారలేదు.

స్వామికి ఒక చిన్న ఉపాయం తట్టింది. వెంటనే ఆ ఆస్థానంలో గోడకు తగిలించ బడిన రాజు బొమ్మను ఊడబెరికి, క్రింద పారేశి, దానిని త్రొక్కుతూ ఉమ్మేశాడు. ఈ అఘాయిత్యాన్ని చూస్తూ రాజూ నిశ్చేష్టుడై పోయాడు.

తన ఎదుటగా తన విగ్రహాన్ని అవ మానిస్తున్నాడు. రాజుకు కోపం ఆగింది కాదు.

"అదేమి వైపరీత్యం స్వామీ! నా ఎదుటగా నా విగ్రహాన్ని అవమానిస్తున్నారా?" అన్నాడు ఆగ్రహంతో

"ఆ బొమ్మ మీదైనా, మరెవరిదైనా అదొక నిర్జీవమైనవస్తువు. దాని మీద మీ కెందుకంత మక్కువ? ఆ చిత్రం మీదైనంత మాత్రాన దానిని గౌరవించాలా? మిమ్మల్ని గౌరవించాలన్నా, పూజించాలన్నా, మనస్సులోనే ఊహించుకుని గౌరవించుకోవచ్చుగా! మధ్యలో యీనిర్జీవమైన చిత్రం ఎందుకు? విగ్రహారాధనకు వ్యతిరేకులైన మీకు యిది వ్యతిరేకం కాదా!" అన్నాడు.

దానితో రాజుకు జ్ఞానోదయం కలిగింది. వెంటనే స్వామి పాదాలను కౌగలించుకుని "నా తప్పులను క్షమించండి. నా మనస్సు మారింది" అంటూ వేడుకున్నాడు.

# అన్నయ్య

"శోభశ్రీ"

—(౧)—

"రిక్షా పిలు తమ్ముడూ!" అన్న పిలుపుతో నా ఊహాలన్నీ పటాపంచలైపోయాయి. "తమ్ముడూ!" అన్న పదమే నా హృదయంలో పదేపదే పలికిందిగాని దాని వెనుకమాటలు వినబడలేదు. చిత్తరపోయి ఆయన, "మా అన్నయ్య" వంక చూచాను. ఆ ముఖంలో మూర్తీభవించిన ముగ్ధత్వం, సుహృద్భావం, ప్రేమ నా కళ్ళకనుపాపల్లో కలిసిపోయాయి.

"రిక్షాపిలు నాన్నా!" తిరిగి ప్రేమతో రెట్టించాడు.

దబదబా బయటకు నడిచాను బరువైన గుండెతో.

♦ ♦ ♦

ఆ రోజు మా ప్రక్క భాగంలోకి ఎవరో క్రొత్తగా అద్దెకొచ్చారని తెలుసుకొన్నప్పుడు, క్రొత్తవారితో స్నేహమౌబోతోందని ఉర్రూతలూగాను.

నూతన పరిచయ భాగ్యం ఏనిముషాన కలుగుతోందా అని కలలు కంటున్న సమయమది.

"రవి!" అన్న పదంతో వెనుదిరిగాను, ఆశ్చర్యంగా, క్రొత్త గొంతుక ఎవరిదోనని.

నా హృదయంలో ఒక అల ఉవ్వెత్తుగాలేచి తిరిగి యథాస్థానానికొచ్చింది.

"అయితే!... మా ప్రక్క భాగంలో క్రొత్తగా చేరిన అపరిచితుడు ... ఆశ్చర్యపడటంలో అసహజం లేదుగదా? నా కళ్ళు ఆయన కళ్ళల్లో దేనికోరకో వెతికాయి ... అవీ అంతేనేమో! ఎందుకో ఒకే క్షణంలో ఇద్దరి పెదిమలమీద చిరునవ్వు చిందులాడింది."

"ఏం చదువుతున్నావయ్యా?" తిరిగి అదే కంఠంతో ఒక ప్రశ్న.

"ఇంటరు ... మొదటి సంవత్సరం!" నా జవాబు, అదే మా పరిచయానికి నాంది!

♦ ♦ ♦

ఆయనే మా అన్నయ్య! ఆమె మా వదిన!!

"ఈ అబ్బాయి ఎవరు?" అనే ప్రతి ప్రశ్నకు "నా తమ్ముడు!" అని గర్వంతో జవాబిచ్చేవాడు.

ఆ మాటంటుంటే ఆ ముఖంలో నూతనజ్యోతి వింతకాంతులతో వెలిగేది.

కాని నా మోము చిన్నబోయేది! కారణం ... అనూహ్యం, అపసవ్యం, ఆశించదగ్గదిగాదా జవాబు. ...

కారణ మీయనికి తెలుసు ... నాకు తెలుసు.

దానికి నాలోనే నేను క్రుగ్గి, కృంగి కృశించిపోతున్నాను ... ఆయన ఆ బాధను హృదయంలోనే యిముడ్చుకొని, చెరగని చిరునవ్వుతో, కాలాన్ని గడుపుతున్నాడని ఊహించాను.

అది తలుపుకొచ్చినప్పుడల్లా నాలో అగ్నిపర్వతాలు పగులుతయి ... లావా ప్రవహిస్తుంది ... సముద్రాలకుప్పెన వస్తుంది ... దేశాలు ధ్వంసమౌతయి ... కాని ఎవరు కనిపెట్టలేరాస్థితిని — కాని చదువరులే దానిలోని నిజానిజాల్ని గ్రహించి, నన్ను దూషించినాసరే, లేక నిష్కపటంతో నిట్టూర్పువిడచి నిష్క్రమించినా సరే!

♦ ♦ ♦

"తమ్ముడూ!" అని ఆయన నోటినుండి వచ్చే పదంలో అమృతం చిలుకుతుంది.

"అబ్బా!" ఆ అమృతాన్ని గ్రోలి సంతోషాన్ని ఆస్వాదించగలశక్తి నాలో లేకపోయిందిగదా!

కాని ... కాని ... నేను తిరిగి ఆయనను, ఆ

శాంతమూర్తిని, దయాపరుని, "అన్నయ్యా!" అనే పదంతో సత్కరించలేకపోతున్నాగదా!

మా ప్రక్క భాగంలో జేరిన తరువాత ప్రథమ పరిచయంలోనే "ఏమండీ!" అనే పిలుపే నాలో నిబిడీకృతమైపోయింది.

వారు ప్రేమతో పిలిచిన "తమ్ముడూ!" అనే పదానికి నా జవాబు "ఏమండీ!" యేనా? ఇదేనా న్యాయం??

అట్లా పిలిచినప్పటికి నా నాలుకకు తూట్లుపడలేదు ... శరీరం విచ్ఛిన్నమవ్వలేదు, హృదయం ఆక్రోశించలేదు — కాని అన్నిటికి మిన్నయైన ఆత్మ వజ్రప్రహారంతో సహస్రముక్కలైపోయేది.

"నాకు అన్నయ్యలేని కొరతను తీర్చాడు ... నేనూ అంతే!"

♦ ♦ ♦

నాకు ఒక రోజు తీవ్రమైన జ్వరమొచ్చింది. మూసినకన్ను తెరవకుండా అలానే పడుకొని వున్నాను. నాటఒకటి ... రెండు ... నాలుగు ... జ్వరం పెరిగిపోతోంది ... టైఫాయిడ్ అని డాక్టర్లు చెప్పారు చాటుగా పెద్దవాళ్లతో. ...

అది పదుహేనవరోజు ... ఏమాత్రం నాలో జ్వరం వెనుకంజవేయలేదు. కన్నీటితో, బరువైన కళ్ళలో మా అన్నయ్య, వదిన కనబడ్డారు నాకు.

"త్వరలోనే తగ్గుతుంది తమ్ముడూ!" మంచం మీద నా ప్రక్కగా కూర్చుంటూ అన్నాడాయన.

ఆయన మనస్సులోగూడ రెండు శక్తులు అద్వితీయంగా పోరాడుతున్నయ్యని, ఆయన ముఖమే చెబుతోంది.

నా శరీరం కుష్కించిపోతోంది. శక్తినంతా కూడగట్టుకొని "ఏమండీ! మీ ప్రియమైన తమ్ముడిని మర్చిపోరుగదూ?"

మా వదిన చటుక్కునలేచి నా నోరు మూసింది. నా యీ పాపిష్టినోరు ఆ సమయంలో గూడ "అన్నయ్యా"! అని పిలువలేకపోయింది! నన్ను నేనే తిట్టుకున్నాను. వంద చెంపపెట్లు పెట్టుకున్నాను. అటువంటి నా నోటిమీద పవిత్రమైన మా వదిన చేయి ఉండటం ఇష్టంలేక, "వదినా! జ్ఞాపకం వుంటానా?" అంటూ ఆమె చేతిని నా చేత్తో తీసివేశాను.

"బాబూ! తప్పుకదూ! నీవు నూరేళ్ళు జీవిస్తావు నాన్నా!" అన్నది కళ్ళుమూసుకొని ఆ మాతృమూర్తి.

♦ ♦ ♦

ఆ దీవెనే ఫలించింది. -నాకు త్వరలోనే స్వస్థత చేకూరింది. తిరిగి కొద్దికొద్దిగా తిరగటం మొదలు పెట్టాను.

కాని నా మనోవేదన కంతులేదు ... నా ఆత్మను నా చేతిలోకి చిక్కించుకోలేకపోతున్నాను ... "ఆయనను" — "అన్నయ్య" - అని పిలువలేకపోతున్నాను ... అదే నాలోని ఆవేదన ... దానితో గూడిన ఆలోచన కంతులేదు.

"ఈ రోజున మా అన్నయ్యను "అన్నయ్య" అని పిలువవల్సిందే!" ఒక రోజు నిశ్చయంచేసుకున్నాను - సముద్రాలు పొంగినా, అగ్ని పర్వతాలు పగిలినా, ఆకాశంకూలినా, నా మనోనిశ్చయానికి మార్పులేదని శపథంచేసుకున్నాను.

"అవును, ఆయనే వస్తున్నారు ... ఆఫీసునుంచి!" ఆయన యింట్లోకి వెళ్ళగానే నేనూ వెళదామనుకున్నాను. "వెళ్ళగానే ఏమి అడగాలి?" నా గొంతులోనే గుండ్రాయిలా కూర్చుంది ఆ ప్రశ్న.

అదే సమయానికి ఉదయం ఆఫీసులో ఎవరో క్రొత్త వ్యక్తితో మాట్లాడుతున్నట్లుగా చూచాను ఆ ప్రక్కరోడ్డునవస్తూ.

"ఇంకేం! ఆ ప్రశ్నే అడుగుతాను!" అనుకున్నాను, "కాదు ముందుగా మాటలన్ని వరుసగా

కూర్చుకొని, వెళ్ళిన వెంటనే తడబడకుండా అడగాలి. ... ...”

“అన్నయ్యా! ఇవాళ ప్రొద్దున ఆఫీసులో నీతో మాట్లాడుతున్నాయన ఎవరు?” బాగుంది ప్రశ్న, అనుకున్నాను ... అనుకోవడమే తరువాయి, బయల్దేరాను. వారి భాగంలో కాలుపెట్టాను.

ఆయన నేను రావటం చూచాడు.

“ఏంతమ్ముడూ ... బజారువెళ్దామా?” నిర్మలమైన మనస్సుతో అడిగాడా ప్రశ్నను ... ఆ వర్ఛస్సు, మాటలలోని మృదుత్వం, నన్ను మురిపించాయి ... నాలోని నాడులు కదిలాయి, ఆ ప్రేమ పలుకులకు. కాని సంబాళించుకున్నాను ... నా శపథం వెన్నుమీద చరిచింది!

“ అ ... అ_అ . . అ ... ఏమిటండీ?” నా కళ్లు తిరిగిపోయినయి ... పడిపోతూ, రోడ్డుమీదకు పారిపోయాను _ నా తల సిగ్గుతో కుంచుకపోయింది. మరెన్నడు ఈ వెధవముఖాన్ని ఆ పవిత్రమూర్తికి చూపకూడదనుకున్నాను.

నా యీ చేష్టకు నిర్ఘాంతపోయి వుంటాడని ఊహించి వూరుకున్నాను ... కాని ఆయనను చూడకుండా ఒక్క క్షణం వుండలేనుగా!!

♦ ♦ ♦

నాలుగేళ్ళు యీ ఆవేదనతోనే గడిచిపోయాయి. నా కోరిక ఫలించలేదు ... ఇంత జరుగుతున్నా, అంతా అర్థంచేసుకొని 'ఆయన' మోముమీద చిరునవ్వు మాయనీయటంలేదు.

మా యందు భగవంతుడు పూర్తిగా వ్యతిరిక్తుడయ్యాడు. నాకు విచారం కలిగించేవార్త నొకదానిని _ అతిగంభీరంగా చెప్పాడు అన్నయ్య... కాని నాకు తెలుసు ఆయనపడేబాధ ... ఏవరు కనిపెట్టలేరు నేను తప్ప ...

ఆ వూరినుండి ఆయనకు బదిలీ అయింది ... వెంటనేవెళ్ళి జాయినవ్వాలి. ...

భూమ్యాకాశాలు తిరగటం స్తంభించాయా అనిపించేలా అయిపోయింది ... ఆత్మనిగ్రహశక్తి అణిగిపోయింది.

మా యిద్దరిని చూచి ఓర్వలేక భగవంతుడు దుష్టశక్తిని పంపాడా అనిపించింది ... మనస్సులో కల్లోలం ఏర్పడింది ...

వెంటనే “అన్నయ్యా!” అంటూ ఆయనమీదకు పడిపోయాను. అదే నా ప్రథమవిజయం.

“తమ్ముడూ!” అంటూ ప్రేమతో హృదయానికిహత్తుకున్నాడు మా అన్నయ్య.

మా అన్నాదమ్ములను జూచి మావదిన ఆనంద భాష్పాలు రాల్చిందనుకుంటాను ... లేకపోతే మమ్మల్ని చూస్తూ చీరచెంగుతో కళ్ళుతుడుచుకోవాల్సిన అవసరమేమొచ్చిందామెకు!

♦ ♦ ♦

“తప్పక శలవల్లో మా వూరు వస్తావుగదూ, రవీ!” మా వదిన అడిగింది.

“తప్పకుండా, వదినా”

“రావాలి తమ్ముడూ! వెళ్ళగానే అడ్రసు వ్రాస్తూ ఉత్తరం వ్రాస్తాను ... శలవలివ్వగానే వస్తే పదిరోజులుండవచ్చు.” మావదిన మాటను సమర్థించాడు అన్నయ్య.

రైలుగంట మ్రోగింది ... బండి కదులుతోంది.

అనుకోకుండా చేతులుజోడించి నమస్కారం చేశా నా దంపతులకు_అదే మా అన్నయ్య, వదినలకు!

— ౦ —

# మహత్తర మానవతావాది మహాత్మాగాంధీ

[మహాత్మాగాంధీ 89 వ జయంత్యుత్సవ సందర్భంగా]

సోవియట్ ప్రజల శ్రద్ధాంజలి



కొన్ని దశాబ్దాలపాటు భారత దేశంలో విముక్తి ఉద్యమానికి నాయకత్వం వహించిన భారత మహాపురుషుడు మహాత్మాగాంధీ జన్మించి యిప్పటికి 89 సంవత్సరాలయింది. భారత ప్రజల జీవితంలోని చారిత్రక సంఘటనలతో ఆయనకు అవినాభావ సంబంధం వుంది.

ప్రజానాయకుడు, తత్వవేత్త అయిన మహాత్మాగాంధీ ప్రపంచ ప్రఖ్యాత పురుషుడు. రాజకీయ, ఆర్థిక స్వాతంత్ర్యాల కొరకు భారత ప్రజలు జరిపిన వీరోచిత పోరాటం పట్ల గొప్ప ఆసక్తినీ, హృదయపూర్వకమైన సానుభూతినీ కలిగివుంటూ వచ్చిన సోవియట్ ప్రజలకు, ఈయన చిర పరిచితుడు. సోవియట్ దేశంలో మహాత్మాగాంధీ గొప్ప మానవతా వాదిగానూ, తన యావజ్జీవితాన్ని మహత్తర ఆదర్శాలకే అంకితం చేసిన వ్యక్తిగాను వలస పెత్తందారీ విధానానికి వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో భారత ప్రజలను సమీకరించడానికి అత్యంతంగా కృషి సల్పిన వ్యక్తిగానూ గౌరవిస్తాము. మహాత్ముని దీర్ఘ జీవితంలోని వివిధ దశలనుగురించీ మాకు తెలుసు. గత శతాబ్దపు టంత్యంలోనూ, యీ శతాబ్దారంభంలోనూ, దక్షిణాఫ్రికాలో జాతివిద్వేషకులకు వ్యతిరేకంగా ఆయన జరిపిన అఖండ వీరోచిత పోరాటాన్ని గురించి మాకు తెలుసు. భారత దేశానికి ఆ మహామహుడు తిరిగి రావడంతోటే బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ఉద్యమం ప్రారంభించిన విషయంకూడా మాకు తెలుసు. భారతీయ మహాప్రజల నుద్దేశించి గాంధీజీ చేసిన విజ్ఞప్తికి లక్షలాది భారతీయ దేశభక్తుల హృదయాలు స్పందించాయి. 1920 లో జాతీయ కాంగ్రెసూ, మహాత్మాగాంధీ యిచ్చిన పిలుపునందుకొని, భారత ప్రజలు బ్రహ్మాండమైన సహాయ నిరాకరణోద్యమాన్ని ప్రారంభించారు. బ్రిటిష్‌వారిని వైదొలగమంటూ 1942లో మహాత్మాగాంధీ చేసిన 'క్విట్ యిండియా' నినాదాన్ని ప్రజలు వలస పెత్తందారీ పీడనకు వ్యతిరేకంగా జరిగే పోరాటానికి ఒక నినాదంగా మార్చివేసారు. మహాత్మాగాంధీయొక్క ప్రధాన అనుచరుడైన జవహరలాల్ నెహ్రూ తన స్వీయ చరిత్రలో సరిగ్గానే యిలా వ్రాసారు. ప్రజానాయకునిగా గాంధీజీ యొక్క మహత్తర కౌశల్యం

ఏమిటంటే ప్రజల మనస్తత్వాన్ని చక్కగా తెలుసుకొని ఉద్యమాన్ని పెంపొందచేయడానికి పరిస్థితులు ఎప్పుడు పరిపక్వంగా వున్నాయో గ్రహించేవారు (రష్యన్నుండి పునరదువదితం).

జాతివివక్షతలంటే ఏమాత్రం గిట్టని సోవియట్ స్త్రీ పురుషులు, జాతిమత విభేదాలతో ప్రమేయంలేకుండా సమస్త ప్రజలూ స్వతంత్రులు కావాలంటూ గాంధీజీ చేసిన కృషికి గొప్ప విలువ నిస్తున్నారు. భారతీయ సమాజంయొక్క అభివృద్ధిని శతాబ్దాలుగా కుంటుపరుస్తూ వచ్చిన వర్ణ వ్యవస్థకు వ్యతిరేకంగా, మహాత్మాగాంధీ ఏవిధంగా తీవ్రంగా పోరాడారో మాకు తెలుసు. వలస పెత్తందారీ విధానానికి వ్యతిరేకంగా జరిపే సమిష్టిపోరాటంలో హిందువులు, ముస్లిములూ ఐక్యతతో నిలబడాలని కోరుతూవచ్చారు.

స్త్రీలకు సమాన హక్కులు యివ్వాలని గాంధీజీ జరిపిన పోరాటాన్ని, భారతీయ ప్రజల మహోన్నత సంస్కృతీ సాంప్రదాయాలను పునరుద్ధరించడానికి ఆయనచేసిన కృషినీ, ఆయన దేశభక్తినీ, భారత ప్రజల ప్రతిభా విశేషాలపట్ల ఆయనకుగల విశ్వాసాన్ని మేము హర్షిస్తున్నాము.

రష్యాతో మహాత్మాగాంధీకి వుండిన దృఢమైన సంబంధాల గురించి తలచుకుని సోవియట్ స్త్రీ పురుషులు ఎంతో సంతోష పడతారు. రష్యన్ మహా రచయిత లియోటాల్‌స్టాయ్ భావాలు గాంధీమహాత్మునిపై గొప్ప ప్రభావాన్ని కలుగజేశాయి. టాల్‌స్టాయ్ చనిపోయిన పది సంవత్సరాల తరువాత, ఆయన జీవితచరిత్రను వ్రాసిన జోసఫ్ డాక్ "టాల్‌స్టాయ్ పట్ల మీ అభిప్రాయమేమిటి?" అని అడిగిన ప్రశ్నకు గాంధీజీ సమాధానం చెబుతూ యిలా అన్నారు. "ఆయనను మనఃపూర్వకంగా మెచ్చుకునేవారిలో నేనొకడిని. నా జీవితంలో ఆయనకెంతో ఋణపడివున్నాను."

టాల్‌స్టాయ్‌కి తానెన్నడూ చూడని తన భారతీయమిత్రుడు గాంధీపట్ల గొప్ప గౌరవం ఉంటుండేది. మహాత్ముని స్వీయ చరిత్రను టాల్‌స్టాయ్ ఎంతో ఆసక్తితో పఠించి, ఆయనతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపేరు. టాల్‌స్టాయ్ తాత్విక దృక్పథానికీ, గాంధీజీ తాత్విక దృక్పథానికీ సన్నిహిత సంబంధమున్నదని గాంధీజీ జీవిత చరిత్ర వ్రాసిన వారందరూ అభిప్రాయ పడుతున్నారు. గాంధీజీ ప్రబోధించిన "సత్యాగ్రహ"నికీ టాల్‌స్టాయ్ ప్రబోధించిన అహింసాత్మక ప్రతిఘటనకూ దగ్గర సంబంధమున్నది. గాంధీజీ టాల్‌స్టాయ్‌ల జీవితాలూ భావాలను గురించి పరిశోధనలు జరిపిన ఫ్రెంచి మహారచయిత, మాన

వతావాదీ అయిన రోమారోలా వారిద్దరి తాత్త్విక దృక్పథాలు ఒకలాంటివేనని చాల సార్లు వ్రాశారు. ప్రపంచ పీడిత ప్రజలపట్ల వారిద్దరూ చూపిన గొప్ప ఆసక్తి, సత్యం విషయంలో వారు చేసిన పరిశోధనలు, తమ ప్రజల సాంఘికనైతిక పునరుద్ధరణకై వారు జరిపిన కృషి యీ ఫ్రెంచి మహారచయితను అత్యంతంగా ఆకర్షించాయి.

మహాత్మాగాంధీ తాత్వికదృక్పథంతో తాము ఏకీభవించడం లేదన్న విషయాన్ని సోవియట్ ప్రజలు కాదనడంలేదు. కాని విభిన్నమైన ప్రపంచ దృక్పథాలను కలిగివుంటూ తమ దేశాలను విభిన్నమైన మార్గాలలో అభివృద్ధిచేసుకొనడం ఆయా దేశాలకు సంబంధించిన ఆంతరంగిక విషయమని సోవియట్ ప్రజలు సర్వదా భావిస్తూ వచ్చారు. యిప్పుడూ అలాగే భావిస్తున్నారు. చాలవరకు గాంధీమహాత్ముడు రూపొందించిన సూత్రాల ననుసరించి జరిగిన సుదీర్ఘ భారత విముక్తి ఉద్యమంలోని వీరోచిత సంఘటనలపట్ల సోవియట్ ప్రజలకు గొప్ప గౌరవభావమున్నది.

మహోన్నత మానవతా భావాలతో నిండివున్న తన ఉపదేశాల ద్వారా మహాత్మాగాంధీ ఒక్క భారతీయ ప్రజలకేగాక అభ్యుదయ ప్రపంచానికంతటికి అభిమానపాత్రుడయారు.

# మీకు మంచి
# మీ దేశానికి మేలు

లేమి అనేది లేకుండా చేసుకోవాలనే జాతీయ ఆదర్శానికి రూపురేఖలు దిద్ది, గమ్యం వైపుకు నడిపించేదే ద్వితీయ పంచవర్ష ప్రణాళిక.

ఏ వృత్తిలో, ఏ వ్యాసంగంలో వున్న వారైనా ప్రణాళిక విజయానికి ఎంతో సహాయం చేయగలరు. ఈ సహకార బలంతో మన జాతి సంపద, సమృద్ధి సాధించుకోనగలుగుతుంది.

ఆహార ధాన్యాలు, పారిశ్రామిక వస్తువులు అధికంగా ఉత్పత్తిచేసి, సంఘ సంక్షేమ కార్యకలాపాలలో పాల్గొని, సొమ్ము ఎక్కువగా ఆదా చేసి జాతీయ పొదుపు సర్టిఫికేట్లలో పెట్టుబడి పెట్టండి - నవ భారతాన్ని రూపొందించడంలో నిర్మాణాత్మకమైన మీ పాత్రను మీరు నిర్వహించండి. అది మీకు, మీ కుటుంబానికి ఎంతో మేలు చేస్తుంది.







ప్రణాళికకు
సహకార
మివ్వండి

## మీ మేలుకు మీరు కృషి చేయండి!




## అవలక్షణాల ముఖం?

శ్రీ కె. పార్థసారధి

ఒకప్పుడు ఒకరాజు ఉదయంలేవగానే అంతఃపురపు కిటికీలోనుండి చినిగిపోయి, దుమ్ముధూళి ఆవరించియున్న దుస్తులతో నున్న బిచ్చగాడు రాచనగరుముందు తిరుగాడుచుండుటనుచూచి "ఉదయంలేవగానే యీరోజున యీ దరిద్రుని ముఖము చూచాను - ఏమికీడుకలుగనున్నదో!" ననుకుంటూ పరధ్యాన్నంగా కుర్చీలోనుండి గభాలున లేవగానే పైన తెరచియున్న కిటికీతలుపుమూల తలకు గ్రుచ్చుకొని రక్తము బొళబొళా కారసాగింది.

రాజుకు కండ్లలో నీరు గిర్రున తిరుగడముతోబాటు మితిమీరిన కోపమువచ్చి భటులనుపోయి ఆ బిచ్చగాణ్ణి బంధించి తెమ్మని ఆజ్ఞాపించాడు. బిచ్చగాడు బంధింపబడి రాజు ఎదుట నిలుపబడ్డాడు.

రాజు కోపోద్రేకంతో కండ్లెర్రచేస్తూ "ప్రొద్దున్నే యిక్కడ తప్పితే మరే ప్రదేశము కనుపించలేదా నీకు! నీ అవలక్షణాల ముఖంచూచి నాకు ఎంతగాయం తగిలిందోచూడు! ఇందుకుగాను నీకు ఉరిశిక్ష విధిస్తున్నాను" అని గర్జించాడు.

బిచ్చగాడు "క్షమించాలి మహాప్రభూ! ఒక చిన్న విన్నపం - మీ ముఖంకంటె నా ముఖమే మెరుగైనది. నా ముఖాన్ని ఉదయాన్నే చూడటంవలన మీకు గాయము మాత్రమే ఏర్పడింది; మీ ముఖం చూడటంవలన నాకు ఉరిశిక్ష ప్రాప్తించింది. మన యిద్దరి ముఖాలలో ఏది అవలక్షణాలదో మీరే చెప్పండి!" అన్నాడు నమ్రుడై.

ఆ మాటలు వినేసరికి రాజుకు తన మూఢ విశ్వాసమునకు సిగ్గేసి బిచ్చగానిని బంధవిముక్తునిచేసి, మంచి దుస్తు లిప్పించి, భోజనము పెట్టించి పంపేశాడట.

(——)

# విశ్వసుందరి

శ్రీ K. V. సుబ్బారావు బి. ఏ.

(గతసంచిక తరువాయి)

"అయ్యో! అయ్యో" అని కలకంఠి మొత్తుకుంది. కాని ఆ రాక్షసుడు ఆమె మొర ఆలకించలేదు. ఉరిమినట్లు "పకాపకా" నవ్వి వెళ్ళిపోయాడు. భువనసుందర్‌ను మ్రింగేసిన తరువాత గదిలోపడుకొని నోరుతెరచి గురకపెట్టి నిద్దరపోతున్నాడు. కలకంఠి నెమ్మదిగా రాక్షసుని నిద్రాభవనంలోకి వచ్చింది. సైగచేసింది భువనసుందర్‌కు బయటకు రమ్మని. నెమ్మదిగా భువనసుందర్ రాక్షసుని కడుపులోనుండి నోట్లోకివచ్చి గుట్టుచప్పుడుగా రాజకుమార్తె ఒడిలోకి దూకాడు. ఇద్దరూ బయటకొచ్చేశారు.

"ఇప్పుడెలా రాక్షసుడిని చంపటం -?" భువనసుందర్ అడిగాడు.

"ఈ రాక్షసుడి ప్రాణం క్రిందగదిలో ఒక మణిలోవుంది. కాని ఆ మణివంటివే మరో ఎనిమిది మణులుకూడా అక్కడ వున్నయ్. ఏ మణిలో రాక్షసుని ప్రాణంవుందో కనుక్కోటం కష్టం. ఆ గదిలోకిపోయి వాడి ప్రాణంవున్న మణిని నేలకేసికొడితే రాక్షసుడు చస్తాడు. లేక ఇంకో ఇతర మణిని ముట్టుకున్నారంటే నిలువున చిత్రవధచేయబడతారు. అందుకనే రాక్షసుడి ప్రాణం యేదో కనుక్కోలేక చిత్రవధయైపోయినవారనేకమంది వున్నారు. మీ యిష్టం - సాహసించి ముందడుగు వేస్తారో జడిసి తగ్గుతారో మీరే నిర్ణయించుకోవాలి" అంది.

"వెనుదిరగటం భీరువుల లక్షణం. నా లక్ష్యం ఎంత ప్రమాదాన్నయినా ఎదుర్కొని ముందడుగు వేయటమే" అని తక్షణమే ఆ గదిలోకి దూకాడు.

అక్కడ తొమ్మిది మణులున్నయ్. తొమ్మిది మణులు ఒకే మాదిరిగా కనిపిస్తున్నయ్! ఏమణిలో రాక్షసుని ఆయువుందో! సరే ఏదయితే అదవుతుందని నాల్గవమణిని పట్టుకొని నేలకేసికొట్టాడు. తక్షణమందే నిద్రలో రాక్షసుడు వులిక్కిపడిలేచి ముక్కలు ముక్కలయ్యాడు. కాని అంతా విచిత్రంగా వుండిపోయింది. రాక్షసుడికి బదులుగా ఒక దేవ యువకుడు; ఎనిమిదిమంది సేవకులు ఆయా స్థానాల్లో ప్రత్యక్షమయ్యారు.

ఆశ్చర్యంగా చూస్తూ వుండిపోయాడు భువనసుందర్.

"ఆశ్చర్యంగావుందా నీకు! మేము దేవతా యువకులం. మేము దేవేంద్రుడి అనుంగు బంటులం. కాని ఒకసారి మదమెక్కి కనపడిన కన్యనల్లా అవమానపరచసాగినాము. అది దేవేంద్రుడు చూసి మమ్మల్ని యీ రీతిగా శపించాడు. నీ వల్ల శాపవిమోచనులమయ్యాము. ధన్యులము. నీవు కోరిన రత్నాంగుళీయం ఇదిగో. ఇది సర్వ సుఖాలను ఇస్తుంది. దీనిని ధరిస్తే ఎప్పుడు విజయమే వరిస్తుంది. ఇంద - ఇది తీసుకో. ఈ కన్య సుశీల. యీమెను వివాహమాడు" అని చెప్పి ఆ దేవతా పురుషులు మాయమయ్యారు.

భువనసుందర్ రత్నాంగుళీయాన్ని తీసుకొని కలకంఠిని తీసుకొని సరాసరి కలకంఠి రాజ్యానికి వచ్చాడు. కలకంఠి తండ్రి తేజవర్మ కూతుర్ని కౌగలించుకొని ఆనంద భాష్పాలు రాల్చాడు. కలకంఠికి తండ్రే తల్లి. తల్లి చిన్నతనంలోనే పోవటం వల్ల గారాబంగా పెంచాడు. ఒక శుభముహూర్తాన కలకంఠి భువనసుందర్‌ల వివాహం జరిగింది. మూడు రోజులువుండి భార్య దగ్గర సెలవుతీసుకొని సరాసరి మణికర్ణిక దగ్గరకు బయలుదేరాడు.

భువనసుందర్ సరాసరి రాజభవనంలోకివచ్చాడు. సభా ప్రాంగణంలో కొలువుతీర్చి కూర్చున్న మహారాజు మణికర్ణికలకు నమస్కరించి తాను సాధించి తెచ్చిన రత్నాంగుళీయాన్ని మణికర్ణికకు ఇచ్చాడు. ఆమె పైకి మాత్రం సంతోషాన్ని నటించుతూ – "భేష్! నిజంగా వీరుడవంటే నువ్వేనయ్యా! అభేద్యమయిన మూడు వస్తువుల్ని సాధించి ఘనత దక్కించుకున్నావ్! నీకు నా జోహారులు" అని పొగిడింది. భువనసుందర్ యీ పొగడ్తలకు పుబ్బిపోలేదు. ఆమె పొగడ్తలను నిశితంగా పరిశీలించితే పొగడ్తల వెనక ఏదో పెద్ద కుట్ర దాగివుందని అర్థమైంది.

"మీరు కోరినట్లు మూడు వస్తువులను సాధించాను. ఇక మీ మాట నెరవేర్చుకోండి" అన్నాడు.

తన జిత్తులేవి పారకపోయేసరికి మణికర్ణిక నిలువున దహించుకుపోతోంది. భువనసుందర్‌ను చంపించి విశ్వసుందరి జీవితం నాశనంచేయాలని ఎంతో ప్రయత్నించింది. కాని ఆవిడ జిత్తులేవి పారలేదు. ఆమె వాళ్లకు ఎంత అపకారంచేయాలని ప్రయత్నించిందో అంత ఉపకారంగా పరిణమించింది. ఆ కుత్సితురాలి ప్రేలినితెంచి రత్నాంగుళీయం భువనసుందర్ ప్రేలి నలంకరించింది. దానితో ఇంకా మండిపోయింది రాణి.

"నీకు బహుమతి కావాలికదూ!" వెటకారంగా అంది.

"అవును మహారాణీ! మీ పరీక్షలో నెగ్గితే రాకుమారిని నాకిచ్చి పరిణయంచేస్తానని మొదటే వాగ్దానంచేశారుకదా! నీలవదన రాణిగారు ఆడిన మాట తప్పరనే ఇంతవరకు విశ్వసిస్తున్నాను-" అన్నాడు నమ్రతగా.

"అవును! నేను అదే అనుకుంటున్నాను" అని చప్పట్లు చరిచింది. వెను వెంటనే ఇద్దరు భటులు ప్రత్యక్షమయ్యారు.

"ఏయ్ ఇలా రండి. భువనసుందర్‌ను చెరసాలలో వేయండి! రేపు నా కతని గుడ్లు పెరకి చూపించాలి" అంది కోపంగా.

ఇంతవరకు ఇది ఒక వింతగా చూస్తున్న మహారాజు దిగ్గున లేచాడు. "ఆగండి" అని గర్జించాడు. సభాసదులు రిత్తపోయారు.

"ఇంతవరకు మహారాణిచేతిలో కీలుబొమ్మను. కాని ఇప్పుడు ఆమె నా చేతిలో కీలుబొమ్మ. ఈ కృతఘ్నురాలిని వుప్పుపాతరలో వూడ్చివేయండి. రాణి కుట్రకు సంబంధించినవారినందర్ని బంధించండి" అన్నాడు మహా కోపంతో.

మణికర్ణిక పారిపోవటానికి పెనుగలాడింది. కాని ఆవేషాలు కుదరలేదు. పాపం! మణికర్ణిక సజీవంగా ఉప్పుపాతరపాలైంది! మహారాజు భువనసుందర్‌ను సమీపించి – "మా అమ్మాయికి తగిన వరుడివి నీవేనోయ్" అని కౌగలించుకొని ఆనంద భాష్పాలు రాల్చాడు.

ఆ మరునాడే మహా వైభవంతో విశ్వసుందరి భువనసుందర్‌ల వివాహం జరిగింది. భువనసుందర్ వజ్రాల ఉంగరం నేలకురాయగానే గంధర్వకన్య ప్రత్యక్షమయింది. నాగసుందరిని మనసులో తలుచుకున్నాడు. ఆమె రత్నాల బండ్లతో ప్రత్యక్షమయింది. కలకంఠి ఆమె వెంటనే తేజవర్మ వచ్చాడు. మళ్లీ వైభవంగా నలుగురు కన్యలతో వివాహం జరిగింది. నీలవదనుడు అల్లుడికి రాజ్యం ఇచ్చేశాడు. అవసరమైతే అప్పుడప్పుడు అల్లుడికి సలహా లిచ్చేవాడు. భువనసుందర్ నలుగురు రాణులకు నాలుగు బంగారు మేడలు కట్టించి సంతోషాన్ని అనుభవిస్తూ నీలవేణి నగరాన్ని పరిపాలించాడు. ఆ మూడు వస్తువులు వున్నన్నాళ్లు కరువు కాటకాలు తలెత్తిచూడలేదు.



# శ్రీరామకర్ణామృతము

(ఆంధ్రానువాదము)

తృతీయాశ్వాసము

శ్రీ కల్లూరి అహోబలరావు



(గత సంచిక తరువాయి)

౧

శ్రీరామ! గుణధామ! సీతాంగనావల్ల
భా! దయాగుణనిధీ! వందనములు
నీ పాద పద్మముల్ - నెమ్మి దేవేంద్రుండు
పూజించు సతతంబుఁ బూర్ణభక్తి
శివచాపమునుద్రుంచి, యవిరళ కర్పూర
మిళిత దేహుండయి, నళిననేత్ర!
నీలమేఘశ్యామ! నీరజాప్త, విరోధి
నేత్రద్వయంబుగా - నెగడువాఁడ!
కల్పకంబులక్రిందఁ బ్రకాశమైన
పైడిసింహాసనంబున - వేడుకలర
నధివసించితి; శ్రీరామ! యప్రమేయ!
శరణుజొచ్చితి రక్షింపు కరుణతోడ.

౨

శివధనుర్భంగంబుజేసి, శ్రీరామ! కాం
చన సన్నిభంబైన చారునేత్ర
జానకిఁ బెండ్లాడి - చారు రత్నాంకిత
భూషణంబులచేతఁ బొలుపుమీఱు
సీతామహాలక్ష్మి - సిగ్గుచేఁదలవంచి
వామాంకమున భక్తి వఱలుచుండ
నామెఁ గాంచుచు, బహుళార్క చంద్రుల యొక్క
ప్రభల వెలింగెడు రామచంద్ర!
ధీరపురుష! సింహాసనాధిష్ఠుఁడగుచు
ముద్దులొలికించుచున్నావు; ముదముతోడ
నిన్ను స్మరియించు భక్తుల నియతిగల్గి
కావగదవయ్య! శ్రీరామ! కరుణతోడ.

౩

భువనైక సుందర! పూర్ణచంద్రాస్య! రా
జీవనేత్ర! ముకుంద! నీవె శరణు!
ధారాధరశ్యామ! ధరణిపుత్రీనాథ!
భక్తమందారమా! ప్రణుతిసేతు
శ్రీరామ! రఘువరా! చిన్మయాకార! కై
మోడ్పులివే నీకు మోహనాంగ!
శరచాపములతోడఁ జక్రాయుధముతోడ
భుజబలంబున వెల్గు - ముద్దురామ!
భక్తజనముల రక్షించువరద! ఈశ!
చిన్మయాకార! శుభకరా! శ్రీసమేత!
భజనసేతును సతతంబు భక్తితోడ
నభయమొసఁగి రక్షింపుము శుభచరిత్ర!

౪

హార, కేయూర, విహార! హాసోల్లాస!
వైభవారామ! సంపద్విశేష!

మణికిరీటముగల్గి – మంగళస్థానమై
శోభించు శ్రీరామ! సుందరాంగ!
కమనీయమైనట్టి కల్పవృక్షా రామ
మణిగృహంబందు నెమ్మది వసించి
శిష్టులు సేవింప – సీతాసమేతుఁడై
యోగ్యసంభాషణా భాగ్యుఁడగుచు
మునిగినాడ వానంద సముద్రమందు
సతము సత్పథగామివై – సరసచతుర
వచనములఁ గుతూహలుఁడవై - వఱలునట్టి
నిన్నునుతియింతు; శ్రీరామ! సన్నుతాంగ!

౫

రాజశిఖామణీ! రఘువరా! శ్రీరామ!
పూర్ణచంద్రాస్య! సంఫుల్లహృదయ!
పద్మపత్రాక్ష! శ్రీపద్మావతీస్తన
కుంకుమాంకితగాత్ర! కోమలాంగ!
ఆహవభూమి, మదాంధ రాక్షసుల, జం
పినయట్టి శ్రీరామ! వీరపురుష!
గండమండలము, ప్రకాశింపఁ గుండల
యుగళంబు ధరియించు నిగమవినుత!
శుభములొసఁగెడి శ్రీరామ! శుభ్రతేజ!
సుందరుండవు! శ్రీ నంద నందనుఁడవు!
నిన్ను సేవింతు, సతతంబు నిశ్చయముగ
నా మనోదుఃఖముల, బాపుమా! ముకుంద

౬

నిధి వీవు! కోమల నీలమేఘ శరీర!
ప్రతివారు కోరెడి వరములొసఁగ
పాపముల్ సమయించు పతితపావనుఁడీవు!
కరుణా కరుండయిగ్రాలుదీవు!
సౌమిత్రి సేవింప భూమిజతోఁగూడి
మునివరుల్ స్తుతియింప మురిసెదీవు!
కాకుత్స్థ! దశకంఠ - కంఠవిచ్ఛేదనా!
రౌద్రస్వరూప! శ్రీరామభద్ర!

భక్తజనముల రోగంబు బాపఁజేయు
నట్టి దివ్యౌషధము గల్గునట్టివాఁడ!
పద్మముఖముతోడ వెలుంగు పంకజాక్ష!
నిన్ను సేవింతు సతము, మన్నింపవయ్య!

౭

పూర్ణచంద్రునిబోలు-ముద్దుమోముగలాడు
పద్మనేత్రుండయి – వఱలువాఁడు
సుగ్రీవుఁడనయంబు శుద్ధమానసమున
సేవింప, ముగ్ధుఁడై చెలఁగువాఁడు
రాజుల శ్రేష్ఠుఁడై – రాక్షసులనుగొట్టి
వీరాధివీరుఁడై - వెలయువాఁడు
జగముల మోహింపజాలు, దేహముతోడ
మనుజమాత్రుఁడుగాని మాన్యవరుఁడు

రణబలోదగ్రుఁడ సమాన రత్నకుండ
లములు గల్గినవాఁడు; శ్రీలక్ష్మియంద
నుగ్రహముగల్గు రాముండు; నిగ్రహుండు
నన్నుఁ బ్రోచెడిగాత! యనారతంబు.

(సశేషము)

# రాకెట్ - ఇంజనీర్‌గా పనిచేస్తున్న నలుగురు బిడ్డల తల్లి ఫైలిస్ నెబర్

—— (౦) ——

"విజ్ఞాన శాస్త్రరంగంలో మహిళలు విరివిగా ప్రవేశించి పనిచేయాలి"

నలుగురు పిల్లలతో కలకలలాడే సంసారిణి అయిన ఫైలిస్ నెబర్ ఒక విలక్షణవతి అయిన గృహిణి అనవచ్చును. మిగతా గృహిణులకూ ఆమెకూ చాల తేడా ఉన్నది. గ్రాండ్ సెంట్రల్ రాకెట్ కంపెనీ అనే సంస్థలో నెబర్, రాకెట్ ఇంజనీర్‌గా పని చేస్తున్నది. అమెరికా కృత్రిమ ఉపగ్రహ నిర్మాణ కార్యక్రమంలో కొంతభాగం ఈ కంపెనీలో జరుగుతుంది. శ్రీమతి నెబర్ చేయితిరిగిన మెకానికల్ ఇంజనీర్ (యంత్ర నిర్మాణశాస్త్రజ్ఞురాలు). చాల చిక్కైన రాకెట్ యంత్రభాగాలను పరిశీలించి అవిపనిచేసే తీరునుగురించి సేకరించిన వివరాలను విడమర్చి చెబుతుంది. సాంకేతిక విషయాలకు సంబంధించిన నివేదికలు తయారు చేస్తుంది. గణాంక గుణకారాలుచేసి యంత్రాలకు సంబంధించిన పద్ధతులూ, విధానాలు తయారుచేస్తుంది.

అటు గృహిణిగానూ ఇటు ఇంజనీర్‌గానూ పని చేయటం పొసగని సంగతి అని ఆమె ఎన్నడూ అనుకోదు. తన సంసారం, తనబిడ్డల్ని చూచుకొని ఎంతో గర్వపడుతుంది. ఇటు తన శాస్త్రరంగపు కృషిని చూచుకునికూడా అట్లానే అనుకుంటుంది. వాళ్ల కుటుంబంలోని వాళ్లూ అంతే. ఆమె ప్రయోజకత్వం చూసి మురుసుకుంటూ ఉంటారు. ఆమె అట్లా ఉండటం వాళ్ళకూ సంతోషకారణమే అయింది. విజ్ఞాన శాస్త్ర రంగాలలోకి స్త్రీలు ఇంకా చాల హెచ్చుగా రావాలని ఫైలిస్ నెబర్ ప్రగాఢాభిలాష. ఆ విధంగా ఎక్కువమందిని ప్రోత్సాహించాలంటుందామె.

శ్రీమతి నెబర్ తాను రాకెట్ ఇంజనీర్ అవుతానని ఎప్పుడూ అనుకోలేదు. అయితే మెకానికల్ ఇంజనీర్ అనే విషయంలో అట్లా కాదు. చిన్ననాటి నుంచి అటువంటి వాతావరణంలో పెరిగింది. అందుకు తగిన ప్రోత్సాహంలభించింది. ఆమె తండ్రికి ఒక యంత్రాల కార్ఖానా ఉండేది. శాస్త్ర సంబంధమైన విషయాల పట్ల కుతూహలం ఉంటే మగపిల్లలైనా ఆడపిల్లలైనా సరే వాళ్లు వాటినిగురించి పూర్తిగా తెలుసుకోవాలిసిందేననే తత్వం వాళ్ల తండ్రిది.

"నా పదహారవఏట నేను అందరు ఆడపిల్లలలాగానే ఉండేదాన్ని, మా పెరట్లో అప్పట్లో ఒక పాతట్రక్కు ఉండేది — మోటారుగురించి చెప్పమని మానాన్నగారిని అడిగాను. 'పోయి ఆట్రక్కులో ఉన్న మోటారువిప్పి చూడమ్మా, చెప్పటంకంటే అట్లాచూస్తే బాగా అర్థమవుతుంది' అన్నారు. అట్లానేమొదట నేర్చుకొన్నాను. నాపదిహేడవ ఏటనే యంత్రాల భాగాలు అవి పనిచేసే తీరుగురించి కొంతవరకు తెలుసును" అని చిన్ననాటి ముచ్చట్లు జ్ఞాపకం చేసుకొంటుంది.

పర్డ్యూ విశ్వవిద్యాలయంలో తాను చేరి ఇంజనీయరీ చదవటానికి, తన సెకండరీ స్కూలు ఉపాధ్యాయిని ఇచ్చిన ప్రోత్సాహమే కారణమంటుంది శ్రీమతి నెబర్ - ఎక్కువగా మగపిల్లలే ఉండే ఆ ఇంజనీయరీ కళాశాలలో చేరటానికి ఫైలిస్ సంకోచించింది. సెకండరీ స్కూలులో ఆమెకు డ్రాఫ్టింగ్ నేర్పిన ఉపాధ్యాయిని ఇంజనీయరీపట్ల ఆ బాలికకు గల ఆశక్తిని గమనించింది. "ఫైలిస్ మరే ఆలోచనా పెట్టుకోవద్దు. నాకు తెలుసు ఇంజనీర్ కావాలని నీమనసులో బాగా ఉన్నది. నీకు తగినది పర్డ్యూ

కళాశాల. తప్పకుండా చేరి చదువు" అని వీపుతట్టి ప్రోత్సాహించింది.

ఫైలిస్ చక్కగా పాడుతుందికూడా. చదువుకొనే రోజుల్లో కళాశాల వాద్య సమ్మేళనులో ఫిడేలు వాయించటం, బృందగానాలలో కలిసిపాడటం చేస్తుండేది. ఇప్పుడుకూడా శ్రీమతి నెబర్ ఇంటి దగ్గర ఉన్నప్పుడు తన నలుగురి పిల్లల్నీ చుట్టూ కూర్చోబెట్టుకొని ఫిడేలు వాయించుతూ పాడుతూ ఆనందిస్తుంటుంది.

ఫైలిస్ నెబరీకి అభిమాన పాత్రమైన సిద్ధాంతం ఒకటుంది, స్త్రీలు మొదట వృత్తి శిక్షణ పొందాలి. తరువాత కొన్నాళ్లు అది కట్టిపెట్టి సంసారం, పిల్లల్నీ చక్కబెట్టుకోవాలి. పిల్లలు పెద్దవాళ్లు కాగానే మళ్ల తాము వృత్తిలో ప్రవేశించాలి. ఇదే ఆమెసిద్ధాంతం. ఇప్పుడు తానే ఈ సిద్ధాంతాన్ని ఆచరణలో రుజువు పరుస్తున్నది.

భర్త రాబర్ట్ ఒక బేకరి (రొట్టెలుచేసే) కంపెనీ నిర్వహణాధికారిగా ఉంటున్నాడు. సెకండరీ పాఠశాలలో చదువుకొంటున్న రోజులలో వీళ్ళిద్దరికీ పరస్పరం మనసులు కలిసినవి. వీళ్ళిద్దరినీ పశ్చిమ తీరానికి బదిలీచేసిన మీదట కాలిఫోర్నియా రాష్ట్రంలో రెడ్‌లాండ్సు గ్రామంలో స్థిరపడ్డారు. నలుగురు పిల్లల్లో పెద్దవాడు ఫిలిప్‌కి 14 ఏళ్లు; రెండో పిల్ల పమీలకి 12 సంవత్సరాలు; మూడో పిల్ల కేనడేస్‌కి 10 ఏళ్లు. వీళ్లు ముగ్గురూ చదువుకొంటున్నారు. కాగా నాలుగో పిల్ల లీసాకు 4 ఏళ్లు. అది మాత్రం ఇంట్లో ఉంటుంది. శ్రీమతి నెబర్ తనకు చేయటానికి పనిఉంటే బాగుండుననుకొన్నది. తన ఈ అభిమతం భర్తకు తెలిసింది. ఆవిడకుగాని, పిల్లలకుగాని అందువల్ల ఏమీ చెరుపు లేనంత వరకు తనకేమీ అభ్యంతరం లేదన్నాడు రాబర్టునెబర్.

ఆ తరువాత అక్కడికి సమీపానఉన్న గ్రాండ్ సెంట్రల్ రాకెట్ కంపెనీకి ఉద్యోగంకోసం దరఖాస్తుపంపించింది. వెంటనే ఆ కంపెనీ ఆమెను పనిలో పెట్టుకోటానికి అంగీకరించింది. పనిలో చేరిన నాలుగు నెలలకు ఆమెను కృత్రిమ ఉపగ్రహాల నిర్మాణ విభాగానికి నియమించారు.

రెండు సంవత్సరాలనుంచి ఈ ఉద్యోగంలో ఉన్నది. ఈ రెండేళ్లు ఎంతో హాయిగా తనకూ తన కుటుంబానికి కులాసాగా గడిచిందని తన అనుభవాలను నెమరు వేసుకొంటుంది.

ఉదయానలేచి ఫైలిస్ నెబర్ ప్రొద్దుటి భోజనం తయారుచేస్తుంది. ఎడపిల్లల్ని స్కూలుకు పంపి తాను, భర్త ఎవరిపనికి వారు బయలుదేరి పసిబిడ్డ లీసాను పగటి వేళ ఆ పిల్లని జాగ్రత్తగాచూచే ఒకావిడకు అప్పగించి వెళతారు.

"పిల్లలు బడినుంచి రాగానే ఫోనులో పిలిచి మేము ఏమైనా పనులు చేయాలమ్మా" అని అడుగుతారు. "పమిలా రాత్రి భోజనం తయారుచేస్తుంటుంది" అని చెప్పి ఆమె మురిసిపోతుంటుంది.

సాయంత్రం 5 గంటలకు వస్తూ లీసాను తీసుకొని వస్తుంది. ఆ తరువాత ఇంకొంచెం సేపటికి రాబర్టు కూడా వస్తాడు. రాత్రి భోజనాలు చేసేముందు తల్లీ తండ్రీ పిల్లలు అంతా కలిసికూర్చొని కులాసాగా పిచ్చాపాటీ చెప్పుకుంటూ కొంచెంసేపు గడుపుతారు.

ఇప్పుడిక శ్రీమతి నెబర్‌కు పగటిపూట ఆఫీసు పని తరువాత ఇల్లూ సంసారమూ తప్ప మరేమీ పట్టవు. ఇంకా విజ్ఞాన శాస్త్రంలో కొత్త చదువులు చదవాలని అటువంటి కోరికలు ప్రత్యేకంగా ఏమీ లేవు. ఇప్పుడున్న వుద్యోగమే ఆవిడకు నచ్చింది. అందులోనే ఉండాలనుకుంటుంటుంది.

ఈ సమయంలో శాస్త్రరంగానికి తానుగా ప్రత్యేకంగా చేసిన దోహదం ఏమీలేదంటుంది. అయితే "నాలాంటి కొద్ది పాటి పనిచేసేవాళ్లకుకూడా సంతృప్తి, ఆనందం ఉంటుంది" అంటుందా యువతి.

ఫైలిస్ నెబర్ అంతరిక్షవిజ్ఞానం, రాకెట్ పరి

శోధనల విషయంలో గాఢాసక్తితో ఉంటుంది. "అంతరిక్షాన్ని జయించగల ఒక సాధనాన్ని నిర్మించగలిగానుసుకోండి, అప్పుడు ఆలోచిస్తే మానవుడు ఈ మహావిశ్వంలో ఎంత సూక్ష్మాతి సూక్ష్మ భాగమోకదా అనిపిస్తుంది. దానితో మనదృష్టి విశాలంగా ప్రసరించటం ప్రారంభవుతుంది. ఇతర ప్రజల సమస్యలను అర్థంచేసుకోవాలన్న సరార్ధమతిత్వం రేకెత్తుతుంది" అని తత్వవిచార దృక్పథం వెల్లడించిందా శాస్త్రిజ్ఞురాలు.

శ్రీమతి నెబర్ అభిప్రాయంలో అంతరిక్ష పరిశోధనలవల్ల మరింతబాగా వాతావరణ పరిస్థితులను ముందుగా ఊహించటం, వైద్యశాస్త్రంలో అభివృద్ధి, మానవుని మీద విశ్వ (కాస్మిక్) కిరణప్రభావాన్ని గురించి తెలుసుకోవటమే కాకుండా మరొక ప్రయోజనంకూడా ఉన్నది.

"అంతరిక్షాన్ని పూర్తిగా శోధించి వివరాలు తెలుసుకొన్నప్పుడు మానవుని మానసిక బాధ, ప్రయాసలకు సమాధానం లభిస్తే నేనాశ్చర్యపడబోను." అంటుంది.

విజ్ఞానానుభవం, మాతృహృదయము రాసీభూతమైన ఆమె ఇంకా ఇట్లా అంటుంది; "కాలం, కర్మం కలిసివస్తే, దైవానుగ్రహం ఉంటే ఈనాటి అంతరిక్ష పరిశోధన కార్యక్రమాలు మూలంగా మానవులకు లభించే విశాల దృక్పథమూ, అధికతరమైన పరస్పర సద్భావమూ ఉదాత్తగుణాలు మనం అన్వేషించుకొంటున్న శాంతి స్థాపనకు తప్పక దారి తీయగలదనే నా దృఢ విశ్వాసం"





## ఆహారము - పండ్లు

ఒక కప్పు నీళ్లలో అర్థకప్పుతేనె, మూడు కప్పుల సన్నని టమాటోపండ్ల ముక్కలు, రెండు కప్పుల అనాసపండ్ల రసముపోసి పొయ్యిమీదనుంచి తెర్లబెట్టవలెను. పొయ్యిమీదనుండిదించి $\frac{1}{3}$ కప్పు మంచి నిమ్మపండ్లరసము దానితోకలిపి వేడిగాకాని, చల్లగాకాని వాడనగును. ఇది చాల రుచికరముగా రొట్టెలతోటి, దోశలలాంటి ఫలహారములతో ఉపాహారముగా నుండగలదు.

♦ ♦ ♦

తియ్యని పచ్చిద్రాక్ష పండ్లను ఒక సేరు తీసికొని అందులోని గింజలను, పైతొక్కలను తీసివేసి ఒక గిన్నెలో నుంచవలెను. దాంతో సన్నగా తరిగిన అనాసపండ్ల ముక్కలను, తేనెతోమాగిన ఖర్జూరపు పండ్ల ముక్కలను కలిపి వాడనగును. కావలసినవారు దీనిని ఐస్‌లో సయితముంచి సేవించవచ్చును. ఇది చాల రుచిగా నుండును.

♦ ♦ ♦

$1\frac{1}{2}$ కప్పు సన్నగా తరిగిన క్యాబేజిని తగు మాత్రము నీళ్ళలో కొంచెము ఉప్పువేసి ఉడికించి దింపి దాంతో ఒక కప్పు అనాసపండ్ల ముక్కలను, $\frac{1}{4}$ కప్పు మంచి నిమ్మపండ్ల రసముకలిపి భోజనములో వాడినచో మంచి రుచితోబాటు, ఆహార విలువను సయితము పెంచునదిగా నుండును.

♦ ♦ ♦

$\frac{3}{4}$ కప్పు తోలు, గింజలు తీసేసిన నారింజతొనలను ఒక గిన్నెలోయుంచి, అందులో ఒక చంచా మిరియాలపొడి, $\frac{1}{3}$ కప్పు చిక్కని టమాటో పండ్లరసము, తగుమాత్రముగా ఉప్పుచేర్చి భోజనములో వాడనగును.

చివుకుల లక్ష్మీపున్నయ్య

---

ఒక కొంటె విద్యార్థి తన తోడి విద్యార్థినితో "కుమారి కమలాదేవీ! మీకు పెండ్లి యీడు వచ్చింది. ఇక చదువు కట్టిపెట్టి పెండ్లిచేసికొని అత్తవారిల్లు అనే యూనివర్సిటీలో చేరండి" అన్నాడు.

"అలాగా! - మీకు పెండ్లి యీడు మించింది. మీరు పెద్ద చదువులకని ప్రాకులాడక ఏ గుమాస్తాగానో చేరండి. దేవుడు మీకు తోడ్పడుగాక!" యన్నది విద్యార్థిని.

మరువాడ సూర్యప్రకాశం

# జంబూద్వీపము-భారతవర్షము



[27-8-58 నాడు మద్రాసు కేసరి హైస్కూలు సారస్వతసమితి ఆధ్వర్యాన జరిగిన సమావేశములోని శ్రీ వాణి శ్రీనివాస శాస్త్రిగారి ఉపన్యాస సంగ్రహమిది. శ్రీ శాస్త్రిగారు పండితులు, పరిశోధకులుకూడాను. వారి అమూల్య పరిశోధనాత్మకకృషి భౌగోళిక, పౌరాణిక, వైజ్ఞానిక రంగాలలో చాల విశిష్టమైనదేకాక నిగూఢమైన అనేక చారిత్రక, వైజ్ఞానిక ప్రాపంచిక, జాతీయ విషయాలను నిరూపించునదిగా నున్నది. శ్రీ శాస్త్రిగారు వైద్య విజ్ఞానంలో సయితము అపారమేధావంతులు. వారి కృషికి, పరిశ్రమకు అధికార, అనధికార ప్రోత్సాహం, సహాయ సహకారములు జాతీయరంగంలో అభివృద్ధి అభ్యుదయాలకు తోడ్పడగలవు — సంపాదకుడు]

మనము ప్రతిరోజు చేయు స్నానసంధ్యావందనాది కృత్యములందును దేవతాదర్శనముకొరకు వెళ్లినపుడును ఆ పూజార్లను దేశకాల సంకీర్తమని చేయుదురు. ఈ దేశ సంకీర్తనములో, జంబూద్వీపె, భరతవర్షె, భరతఖండె, అని చెప్పుదురు. కాని వీటి అర్థమేమిటో జంబూద్వీప పరిమితిఏమి? భారతవర్ష పరిమితిఏమి? అనే విమర్శను ఎవరును చేయుటలేదు. కొంత మందికి ఆసక్తియుండును. కాని వాటిని తెలుసుకొనుట కష్టమని నిరాశ చెందుచున్నారు.

ఈ విషయము మన పురాణములలో ఉన్న దానిని సంక్షేపముగా ఆధునిక విజ్ఞానముతో సరిపోల్చి చెప్పబడుచున్నది. జంబూద్వీపమనగా మనముండు భూగోళమె. ఇది తొమ్మిది వర్షములుగా విభజింపబడినది. ఈ జంబూద్వీపమున ఉత్తర ద్రువమున మధ్యలో బంగారు మేరు పర్వతము గలదు. ఇది ఉత్తర ధృవము నుండి దక్షిణ ధృవమువరకు భూగోళమును చొరచుకొని గ్లోబుకు యాక్సిలువలె యున్నది. ఈ మేరుపర్వతమునకు చుట్టు ఉండు కొంతభూమి అనగా ప్రస్తుతము భూగోళపటమున నిరూపించిన ఆర్కుటిక్ సర్కిలులో ఇమిడియుండు భాగమునకు మేరువర్షమనియు, ఇలావంతుడనే రాజుచే పాలింపబడుటచే ఇలావృతవర్షమనియు పేరు. ఈ ఇలావృతవర్షమునకు దక్షిణమున మూడు వర్షములు, ఉత్తరమున మూడు వర్షములు, తూర్పున ఒక వర్షము, పశ్చిమమున ఒక వర్షమును గలవు. ఈ ఒక్కొక్క వర్షమునకు ఒక్కొక్క వర్ష పర్వతముగలదు. మొత్తమున తొమ్మిది వర్షములకు తొమ్మిది వర్షపర్వతములు గలవు.

ఇలావృతవర్షమునకు ఉత్తరవర్షమగు రమ్యకవర్షమునకు మధ్య నిషధపర్వతము గలదు. ఇది ప్రస్తుతము క్షీణించి సముద్ర పాతమయినది. దీని కుత్తరమున అనగా ప్రస్తుతపు బ్రిటీషు కెనడా రాష్ట్రము, రమ్యక వర్షమగుచున్నది. ఇది రమ్యకుడను రాజుచే పాలింపబడెను. పిమ్మట గ్రేట్ డివైడ్ రెంజి అను ఒక పర్వతభాగము గలదు. అదియే పూర్వకాలపు శ్వేతపర్వతము. ఇది దాటిన పిమ్మట అమెరికా సంయుక్త రాష్ట్రములు. దీనిని పూర్వకాలమున హైరణ్యక రాజుచే పాలింపబడుటచే హైరణ్యకవర్షమనెడివారు. దీని తర్వాత శంట్రలు అమెరికా, మెక్సికోజల సంధివద్ద త్రిశృంగపర్వతముగలదు - దీని మూడు శృంగములలో ఒకటి ఉత్తర అమెరికాలోని రాకీ పర్వతములతోను, రెండవది దక్షిణ అమెరికాలోని ఆండీస్ పర్వతములతోను, ఒకటి తూర్పుగా హైలాండ్స్ ఆఫ్ గయానా అనే చోట క్షీణించిన పర్వతభాగములుగాను నున్నది. ఇది దాటిన పిమ్మట దక్షిణ ధృవమువరకు ఉండు ప్రస్తుతపు దక్షిణ అమెరికా అనునది. మన పురాణములలో చెప్పిన కురువర్షమగుచున్నది.

ఈ పైన చెప్పిన మేరుపర్వతమునకు పశ్చిమమున ఉన్న యూరలు పర్వతపంక్తియె పూర్వకాలపు గంధమాదన పర్వతము. ఇది ప్రస్తుతం సగం సముద్ర పాతమై సగము మాత్రము దక్షిణ భాగమున కన్పడుచున్నది. దీనినుండి పశ్చిమమున యూరోపు ఖండము, పిమ్మట, దక్షిణ ధృవమువరకుయున్న, ఆఫ్రికా ఖండము, కలసి మనపురాణములయందు చెప్పబడిన కేతుమాలమనెడి పెద్దవర్షము. ఈ మేరుపర్వతమునకు తూర్పున వెర్కోయాన్సు, కొలీమా, అనాడీరే, అను ప్రస్తుత కాలపు పర్వతములు పూర్వకాలమున మనవారిచే చెప్పబడిన, మాల్యవంతము మంథరపర్వతము అనునవియే. దీనికి తూర్పునుండి బాగా దక్షిణధృవము వద్దనున్న ఆస్ట్రేలియా ఖండముతోకలిపి వర్షములలో పెద్దదగు భద్రాశ్వ వర్షమై యున్నది. ఈ వర్షము చాల భాగము సముద్రపాతమై మధ్య మధ్య చిన్నచిన్న దీవుల వలెనున్నది. పిమ్మట మేరుపర్వతముందు ఇలావృతవర్షమునకు దక్షిణముగా నీల పర్వతముండెడిది. ఆ పర్వతమంతయు క్షీణించి ఇపుడు కొద్దిగా పర్వతశేషము లున్నవి. దానికి దక్షిణమున ఉన్న టండ్రా భూములు, సైబీరియామైదానము రష్యా దేశము హరివర్షమగును. దీనికి దక్షిణమున తియాన్‌షాన్ పర్వతపంక్తి యున్నది. ఇవియే పూర్వకాలపు హేమకూట పర్వతము. దీనికి దక్షిణమున మంగోలియా దేశము ఆసియాటర్కీ చైనా

దేశములు టిబెట్టు ఇవన్నియు కింపురుష వర్షము. ఈ కింపురుష వర్షమునకు దక్షిణముగా, హిమవత్పర్వత పంక్తి గలదు. దీనికి దక్షిణమున సముద్రము వరకు వ్యాపించిన భాగమే భారతదేశమగుచున్నది. ఇది 19 వందల మైళ్లు వెడల్పును 25 వందల మైళ్లు పొడవును గల్గియున్నది. దీనికి తూర్పున ఇండో చైనా దక్షిణమున కన్యాకుమారి అగ్రము పడమరగా పారసీక దేశము ఉత్తరమున గంగోత్రి గంగ పుట్టినచోటు. ఇది 56 దేశములుగా ముఖ్యముగా విభజింపబడినది. ఇంకా సరిహద్దులలో మరికొన్ని దేశములుగలవు. ఈ భారతవర్షము తొమ్మిది ఖండములుగా విభజింపబడినది. అందు మొదటిది అగు భరత ఖండము ప్రస్తుతపు ఇండియా అను నదియె. మిగిలినఖండములు సముద్రములో చిన్నదీవులుగా నున్నవి. ఉపద్వీపములుగాయున్నవి. ఇవన్నియుకలసి భారత వర్షమగుచున్నది. మిగిలిన వివరములు తర్వాత వివరింతము.

...—.—...

"ఏమండీ! మన అమ్మాయి పెండ్లి సంగతే పట్టించుకోరు ఎలాగ! - ఏదో తగిన సంబంధమును చూడండి త్వరగా" అన్నది భర్తతో.

"అదిసరేగాని - నీకు మన పెండ్లి సంగతి జ్ఞాపకముందా? మన యిద్దరికి సంబంధము ఒనగూర్చిందెవరో ఆలోచించు" అన్నాడు భర్త.

"బలేబాగుంది! యిలాగ మీరు, నేను ఆలోచిస్తూ కూర్చుంటే అమ్మాయికి ఏ ఆలోచన పుడుతుందో బాగా ఆలోచించండి"

మరువాడ సూర్యప్రకాశం

# 'పాపం బ్రద్దలైంది'

'రాఘవ'

తరతరాలనుంచీ, వారసత్త్వం ప్రకారం వస్తున్న మునసబుగిరికి జగన్నాథం రాజీనామా యివ్వటంతోనే, దానిని తప్పకుండా చేయవలసిన బాధ్యత యావత్తూ ఉన్న ఒక్కకొడుకైన ధర్మారావునెత్తి మీదపడింది. వాస్తవంగా ధర్మారావుకి మునసబు గిరి చేయటమంటే యిష్టంలేదు. కాని, తండ్రి ఏమనుకుంటాడో? అనే భయంకొద్దీ సరే అని చేయక తప్పింది కాదు. అప్పటికి ధర్మారావు పెద్దమాట కారిగా లేడు. తండ్రిపేరు చెబితే, తలవంచుకొని ఏపనైనా చేయటానికి, సంసిద్ధుడయ్యేవాడు. ఒక్కొక్కసారి, ఆయన చెప్పినపనిని, తను చేయటానికి మనస్కరించకపోయినా సరే, ఎదురుమాట చెప్పకుండా, కుక్కిన పేనులాగా పడివుండి, ఆ పనిని పూర్తిచేసేవాడు. అప్పట్లో అతను తండ్రినిచూస్తే ఎందుకో గడగడలాడి పోయేవాడు. వ్రాయనూ-చదవనూ కేవలం స్కూలువల్లనేకాకుండా కూడా, జగన్నాథంవల్లకూడా కొంతవచ్చింది. ఏ నాడు జగన్నాథం చెయ్యి చేసుకొని ధర్మారావుని మందలించలేదు. కేవలం కళ్లతోనే కన్నకొడుకుని, తగిన కట్టుబాట్లలోవుంచుతూ వచ్చాడు. మునసబుగిరి చేస్తూన్న క్రొత్తరోజుల్లో జగన్నాథం కొడుక్కి, చాలావరకు తర్ఫీదునిచ్చాడు. దానిని ఆధారంగా పెట్టుకొని ధర్మారావు తండ్రి అడుగుజాడల్లో మెదులుతూరావటం జరిగింది. దుర్గమ్మ కూడా, అప్పట్లో కొడుకు చేస్తూన్న మునసబుగిరిని చూసి, ఎంతో ముచ్చటపడింది. ఎంతో ప్రయోజకుడైనాడని సంతోషించింది. జగన్నాథం యిస్తున్న సలహాలతోనూ — చేస్తున్న సహకారంతోనూ — ధర్మారావు మునసబుగిరి నిరాఘాటంగా చేస్తూ వున్నాడు.

ఒక సంవత్సరం పూర్తిగాగడిచింది. తల్లిదండ్రుల వాత్సల్యంలో ధర్మారావు ఒకవ్యక్తిగా మారాడు. గ్రామంలో ధర్మారావంటే, కేవలం తల్లిదండ్రుల చాటు బిడ్డడు అన్నచిన్నచూపు మాసిపోయింది. చిల్లరతగాదాలను పరిష్కరించి, తీర్పు చెప్పే నేర్పుని ప్రదర్శించసాగాడు. రైతులతో, తెల్లవారిన దగ్గర నుంచీ, లౌకికంగా ఎట్లామాట్లాడాలో తెలుసుకున్నాడు. హద్దు మీరి, పల్లెటూరిలో ప్రవర్తిస్తే అభాసుపాలై పోతామని గ్రహించాడు. ఎంత సేపూ, తన వ్యవహారమేదో తాను చేసుకొని, గుంభనగా చక్కాపోతూండేవాడు. ఆ గ్రామంలో వున్న రైతాంగంలో పరస్పరంగా ఎన్నిపోట్లాట లున్నా, ఎవరి కేసహాయంకావాలంటే, దాన్ని సహృదయంతో చేసిపెడుతూండేవాడు. ఎవరొచ్చి ప్రామిసరీనోటు వ్రాయమంటే, వాళ్లకల్లా వ్రాసిచ్చేవాడు. మామూలుగా గ్రామీణులు సంతోషంకొద్దీ డబ్బురూపంగా ఎంతయిస్తే అంతే తీసుకొనేవాడు. మరే యితరసాయంచేసినా, మనస్ఫూర్తిగా స్వీకరించి తృప్తిపడేవాడు. ఆశ అంతగా వుండేదిగాదు. యిలాంటి జగన్నాథంకుమారుడైన ధర్మారావు, అప్పట్లో — ఆ వూళ్లోనిజంగా 'ధర్మమూర్తి'ననిపించుకున్నాడు.

రోజులు మంచిగానే గడుస్తున్నయి. ధర్మమూర్తి లాగా, ధర్మారావు మునసబుగిరి చేస్తూనే వున్నాడు. అయిదారు నెలలు గడిచినయి. దస్తు వసూలు రోజులొచ్చాయి. రైతాంగం తమతమ

పాలాలకు కట్టవలసిన శిస్తుని యథాప్రకారంగా కడుతున్నారు. ధర్మారావుకి అందచేసే మామూళ్ళి తప్పనిసరిగా యిచ్చే వాళ్లు యిస్తున్నారు. తక్కువగా యిచ్చారేమిటని యే వొక్కరినీ ఎదురుప్రశ్న లేసి, ఎక్కువ రాబట్టడానికి ప్రయత్నించటంలేదు. ఏ రోజున యెంత మామూలు చేతికొస్తే, అంతా తండ్రి చేతికి ఒప్పగించి, తన పనుల్లోకి తలదూర్చేవాడు. కాని, యీ సారి అలా జరగలేదు. ధర్మారావుకి వచ్చిన మామూలుని, తండ్రికంటే ముందుగానే, తల్లి అడిగి తీసుకొంది. 'ఎవరికిస్తే' ఏంలెద్దూ అని ధర్మారావు వూరుకుండిపోయాడు. కాని జగన్నాధం మాత్రం వూరుకోక, ధర్మారావుని పిల్చి, మెల్లగా —

"నిన్న వసూలైన మామూలు ఏంలేదా?" — అని అడిగాడు.

"ఏం లేకపోవటమేమిటి, పాతికరూపాయలు వసూలైతే అమ్మకిచ్చాగా. నీకు చెప్పలేదా?"— అని ఎదురు ప్రశ్న వేసాడు.

"చెప్పలేదురా!" — అని అంటూండగానే దుర్గమ్మ అక్కడికొచ్చి నిలబడింది.

"ఏమే... వాడు నీకు పాతికిచ్చాడటగా —"

"ఊఁ... యిచ్చాడు... దాచాను... ఎందుకూ?"

"ఆఁ... ఏంలేదూ... మామూలుగా నాకిస్తుండే వాడు, నీకిచ్చి ఎందుకు దాయించాడూ అని ఆలోచిస్తున్నాను"

"ఇవ్వకూడదా? మీరేదాయాలిగానీ, నేనుదాయకూడదా? ఏమిటలా అంటారు?" కాస్త కోపంతో గునిసింది.

"వాడి సొమ్ముని యింతవరకూ నేను జాగ్రత్త చేస్తుంటే, మధ్యలో నీవు కల్పించుకొని, మళ్లీ చేయటం దేనికి?"

"ఎవరు జాగ్రత్తగా కూడబెట్టినా వాడి కోసమేగా?"

"అంటే, నేను జాగ్రత్తచేయటంలో ఏదో లోటు జరుగుతోందన్నమాట"

"ఆ మాట నేననను... మీరా సమయానికి లేకపోవటంవల్ల నేనడిగి తీసుకొన్నాను."

"అడిగి తీసుకోక పోతే, వాడివ్వనన్నాడా?"

"నేనేమీ బలవంతంగా అడిగి గుంజుకోలేదు..."

ధర్మారావుకి తలవేడెక్కిపోయింది. తల్లితండ్రు లెందుకు అనవసరంగా తన్ను గురించి, మాటా మాటా పెంచుకొని, వాదనకి దిగుతున్నారో అర్థంకాలేదు. పతనుగా దాచే తండ్రి సమయానికి లేకపోవటంవల్ల అడిగింది. యివ్వక తప్పదుగదా! ఆమాత్రానికి తన తండ్రి, ఆ పాతికా యివ్వమని అడిగి పుచ్చుకొని దాయరాదూ! కీచులాట దేనికి? ముష్టి మునసబు గిరి మీదవచ్చే మామూళ్లు కోసం తగూలాడుకోవాలా! యేమైనా అర్థముందా?

ధర్మారావు తనలో తాను విత్కరించుకొంటూ - తల్లిని, "యిక వూరుకోవే, యెవరన్నా వింటే నవ్వుతారు" - అని తల్లిదండ్రుల గొంతుకన్నా బిగ్గరగా అరిచాడు. ఆపాళాన దుర్గమ్మ నోరు తగ్గించుకొని, చెంగున కట్టుకున్న ఆ పాతిక రూపాయిలను జగన్నాధం ముందు విసురుగా పెట్టి, రుసరుసలాడుతూ వంటింట్లోకి వెళ్ళిపోయింది. జగన్నాధం, ఆ పైకం వంకచూస్తూ — "యీ వెధవ డబ్బు మూలాన ఎన్ని మాటలూ! — ఎంతరగడా! ఛీ, ఛీ" అని ఆ డబ్బుని తీసుకొని సరాసరి యినప్పెట్టవద్దకుపోయి దాచి, ధర్మారావు ఖాతాలో జమవేశాడు. ఇక మొదలైంది ఆ నాటినుంచి జగన్నాధంకి, దుర్గమ్మకి కలవరం. జగన్నాధం వృధాగా కూర్చున్నప్పుడల్లా దుర్గమ్మ ఎత్తిపొడుపుమాటలనేది. అతను నోరుచేసుకొని యెంతో ఓర్పుతో ఆమెను వూరుకునేలాగు చేద్దామనుకునేవాడు. ఆమె లొంగేదికాదు. భర్తచేసే పనుల్ని చూసి భార్యగా విమర్శించేది. జవాబిచ్చేవాడుకాదు. అతని మాటల్ని ఆమె లెఖ్ఖచేసేది కాదు. ఆమె మాటల్ని అతను పట్టించుకునేవాడే

గాదు. ఇరువురి మధ్యా పోటీపోటీ మాటలు, పాత విషయాలను తవ్వుకోవటాలు—, 'నువ్వా పని చేసావు కాబట్టే, నేనీపని చేసానని' జగన్నాథం అనటం, "మీరలా ప్రవర్తిస్తారని ముందే తెలుసుకున్నాను కావునే, నేనీ విధంగా వున్నాను" అని ఆమెగారు పోటీగా అనటం రోజురోజుకి ఎక్కువ కాసాగినయి. యిరువురిమధ్యా పొత్తు సన్నగిల్లటం క్రమేపీ జరుగుతోంది. 'నీదే తప్పని' — జగన్నాథం అంటే, 'మీదే ముమ్మాటికీ తప్పు' అని దుర్గమ్మ రెట్టించ సాగింది. యిరువురిలోనూ ఏదో ఆధిక్యత బలిసిపో సాగింది. కదిలితే కోపం — ఆవేశాలు ఉధృతం కాసాగినయి. ఒకరికొకరు చేయూత లిచ్చుకోవటం తగ్గిపోయింది. ఎవరిచిత్తమొచ్చినట్లువాళ్లు ప్రవర్తించ సాగారు. నోరు మెదిపితే, యింటిపైకప్పు లేచి పోతోంది. పాత్రసామాగ్రి వంటింట్లో దుర్గమ్మ చేతి పుణ్యమా యని బ్రద్దలైపోతున్నది. పొయ్యి విసురుకునే విసనకర్ర సైతం, జగన్నాథంమీద కారాలు — మిరియాలు నూరుతూ టపటపమంటూ శబ్దంచేయటం మొదలెట్టింది. కంచు గ్లాసులతో, మంచినీళ్ళ బిందెల అంచులు గణగణమని మోతమోగటం అధికమైంది. అదే సమయంలో, వాకిట్లో కెవరైన పెద్ద మనుష్యులొస్తే, వాళ్ళకి యింకా బాగా తెలియటంకోసం, దుర్గమ్మ యింటిగుట్టుని బయటపెడుతూండేది. కాళ్ళరిగేవరకూ దొడ్డంతా కలియతిరుగుతూ, పాలేరుమీద కాస్తంతసేపూ — పనిచేసేదానిమీద మరి కాస్సేపు ఆ మాటా యీ మాటా అంటూ, జగన్నాథంమీదవున్న అక్కసంతా వెళ్ళగక్కుతూ, రాచి — రంపాన పెడుతూ అనేది.

"యీవిడెప్పుడూ యింతే, ఒక్కనాడూ సంతోషంగా వుండదు" — అని ఆ పాలేరూ — ఆ పని చేసేది మనస్ఫూర్తిగా అనుకొని, యెన్నిమాటలన్నా, యెన్నితిట్లు తిట్టినా, పట్టించుకోకుండా, "పాత మనిషే — పాతమాటలేగా" — అని దులుపుకొంటూ, తలవంచుకొని పనిచేసుకొనిపోయేవాళ్లు.

జగన్నాథం యీ రగడ యావత్తూ చూస్తూ వింటూవుండేవాడు. భోజనాల దగ్గరకూడా, మౌనమే అంగీకార సూచనంగా వుండేది. ఏంవేసిపెడితే అదే ప్రాప్తి యీ పూట కనుకొని, పెట్టిన ఆ గుప్పెడు మెతుకుల్ని ఎలాగో గతికి, మూతి తుడుచుకొని వసారాలోకొచ్చి, ఆ వాలు కుర్చీలో జారగిలబడేవాడు. ఇంతకన్నా వేరే గత్యంతరం ఏమిటో జగన్నాథంకి తోచేదిగాదు. మాట్లాడితే కురుక్షేత్రం యుద్ధం సాగుతున్నప్పుడు, ఎట్లా నోరు మెదపటం? అన్ని విషయాల్లోనూ దుర్గమ్మదే పైచేయిగా వుండసాగింది. జగన్నాథంకి ఆ యింట్లో స్వేచ్ఛగా బ్రతకటం చాలా కష్టమనిపించింది. యిట్లాంటి దుర్భరస్థితిగతుల సమరంలో ధర్మారావు నిరాఘాటంగా మునసబుగిరి చేయలేకపోయాడు. క్రొత్తగా కాపురానికొచ్చిన జయలక్ష్మికి యీ రసాభాసయేమీ అర్థంగాలేదు. అత్తగారు చెప్పిన పనులన్నింటిని, పుట్టింటినుంచి వచ్చేనాడు రాసుకొన్న పసుపురంగు పోకమునుపే, చేయటానికి పూనుకొంది. క్రొత్త కోడల్ని, కొడుకుతోపాటు కొంతకాలం సుఖపెడదామనే సదుద్దేశ్యం దుర్గమ్మకి ససేమీకలగలేదు. పాతకాలపు ఝాడింపులతో, జయలక్ష్మిని భయపెట్టసాగింది. దుర్గమ్మ పురమాయింపులతో జయలక్ష్మి వణికిపోవటం మొదలెట్టింది. ఊపిరి పీల్చుకుంటానికూడా వ్యవధి నిచ్చేదిగాదు. ఒక్కొక్కసారి యేపనిముందు చేద్దామా! అని ఆలోచిస్తూ నిలబడటం జరిగితే — కళ్ళెర్రజేసి చూస్తూ,

"జెండాకర్రలాగా అలా నిలబడివుంటే, ఆ పనంతా ఎవరుచేస్తారనుకుంటున్నావే? మీ బాబు నౌకర్లు ఎవ్వరూ లేరిక్కడ తేరగాచేయడానికి, చూడు ఆ అంట్లు ఎలా ఎండిపోతున్నయ్యో! పాచి చెంబులు యింకా తోమనేలేదుటే! పాలకుండ కడిగావా? తొట్లో చిట్టువేశావా? మంచినీళ్లు యింకా తేలా? బాగానేవుంది నీ నిర్వాకం! యిలా చేస్తే యివ్వాళీపని తెమిలినట్లే!" — అంటూ ఎడా-పెడా దూసిపోసేది మాటల్ని. జయలక్ష్మి కిక్కురుమనకుండా చెప్పిన ఆ పనులన్నింటిని, గాను గద్దు

గా చేయటానికి నడుంవంచేది. పొరపాటున ంచేయబోయో యింకోటి చేసేది. ఆ రోజున ధింపుకివున్న యిరవై నాలుగు గంటలూ చాలేవి వు. తేదీలు – వారాలూ మారినా, దుర్గమ్మ టలు మాత్రం మారేవిగావు. ఎప్పుడైనా జయ క్ష్మి చేతిలోంచి పట్టుదప్పి యేకంచుగ్లాసో, యేపాల బో, – యేగరిటో – యే యితరవస్తువో–పడటం గిందో, ఆ నాడు జయలక్ష్మికి మంగళహారతులు స్తమానమూ యిస్తూనే వుండేది. కేవలం ఆమె క్కడాన్నే అంటే, అంత బాధపడవలసిన అవ ంలేదు. అలా కాదుగా! జయలక్ష్మి తాత త్తాతల దగ్గరనుండి, ఆమె వరకూ బ్రతికివున్న ళ్లనీ, చచ్చిస్వర్గాన సుఖంగావున్న వాళ్ళనీ యేకరువు డుతూ నిర్మొహమాటంగా ఝాడించిపారవేసేది. ంగా పాపం ఆమె తరఫువారు ఏంచేసారు? ర్గమ్మ అలా నోరు పారవేసుకోడానికి? ఆమె సహజగుణమని యెంతనుకున్నా ధర్మారావూ – ర్నాధం సహించి వుండగలరుగాని, క్రొత్తగా చ్చిన జయలక్ష్మి వుండగలదా? ఉండకేం చేస్తుంది? త్తింటివద్ద అలిగితే ఆర్చేవాళ్లూ – తీర్చేవాళ్లూ ? యివేవీ లేకపోగా శరీరం హూనమైపోయేట్లు రికే దెబ్బలుకూడా తినాల్సొస్తుంది, ఆ దుర్గతి డా లేనికని స్తబ్దుగా తనకి పురమాయించిన ప్రతి ని సహనంతో చేసుకుపోతూండేది. అత్తగార్ని దుపులో పెట్టుకోవటం, కొంతమంది క్రొత్త కోడ కి యిట్టే తెలిసివుంటుంది. అలాంటి గోప్యాయి ట్కా లేవీ జయలక్ష్మికి తెలియకపోవటంచేత, ర్గమ్మ చెప్పింది చెప్పినట్టుగా చేయాల్సొస్తోంది. నీ, 'తన భర్త – ధర్మారావు – నిజంగా ధర్మ రాత్రే, కలగచేసుకొని తనపట్ల బాధ్యతవున్నవారి గా–ఏమైనా మాట్లాడుతారా!' అంటే అలాంటి మీ లేదు. తల్లిచాటు మనిషిలా మసులుతూ ంటారు. ఇదేం కర్మ. భార్యతో మాట్లాడ్డానికి డా తల్లి అనుమతి వుండాలా? వింతగావుంది. వరితోనన్నా చెప్పుకుందామన్నా సిగ్గువేస్తుంది. క భర్తపట్ల తనకే చిత్రంగావుంటే, పరాయివాళ్ల కుండటంలో ఆశ్చర్యమేముంది? స్వతంత్రించి భర్త కన్నం పెట్టడానికి అవకాశం లేదు. అలనా–పాలనా లేని స్త్రీ జీవితంలాగా, నాకీ దుస్థితిఏమిటి? జయలక్ష్మి ఒకనాడు విచారపడింది. తన తల్లిదండ్రులింత తెలివితక్కువవాళ్ళని, తాను కాపురానికొచ్చేంతవరకూ అనుకోలేదు – జయలక్ష్మి. జయలక్ష్మి పల్లెటూరిలో పుట్టి పెరిగినా, చదువూ సంస్కారం మాత్రం తగు మాత్రంగా అలవడినాయి. ఎదుటి వ్యక్తిని పరామర్శించి – ఆత్మీయంగా మాటలాడటం ఆమె పుట్టింటివారికున్న గొప్ప లక్షణం. అదే నేటివరకూ జయలక్ష్మిలో జీర్ణించుకొనివుంది. దాని సాధారణంగా పెట్టుకొని అత్తగారితోనూ, మామగారితోనూ – భర్తతోనూ, కాలం వెళ్ళబుచ్చుకుందామనే వూహించింది. కాని, అలాంటి మంచి లక్షణాలకి, తన అత్తింట్లో అవకాశం కలగనందుకు చాలా విచారపడింది. నోరు మెదిపితే, తిన్నతిండి కక్కేదాకా తిట్టిపోయటం, కన్నెత్తి కారణంలేకుండాచూస్తే, కన్నీరు కాలేంతవరకూ కకాలికలు పడేటట్లు కర్కశంగా సూటిపోటీ మాటలతో – సాధించటం యివి అత్తింట్లో క్రొత్త కోడలైన జయలక్ష్మికి లాంఛనాలు. ఎంత కాలానికి యిక తనకు హాయిగా వుండటం లభ్యమయ్యేది? ఎప్పటికి తన భర్తకు 'నా భార్య జయలక్ష్మి ఏమైంది? ఎలావుంది? ఏంచేస్తోంది?' అని ఆరావచ్చేది? జయలక్ష్మి మరోనాడు కంటతడిబెట్టుకొని కుమిలిపోతూ ఆలోచించుకొంది.

జయలక్ష్మి చాలా చురుకైన మనిషి. పెద్ద పెద్ద కళ్లు. ఆ కళ్ళకి కాటుక వున్నంతకాలం కమనీయమైన భావాలు నిరంతరం కదులుతూనే వుంటయి. బక్కపల్చగావున్న శరీరం పసిమిరంగుతో సమానంగా వుంటుంది. పెళ్ళికాక మునుపు ఆమె చదవని పుస్తకాలు, వాళ్ళ వూరి గ్రంధాలయంలో లేవంటే అతిశయోక్తికాదు. ఎన్ని చదివానని తనెన్నిసార్లు అనుకొంటేనేం? లాభమేముంది? తన భర్తపేరు నిస్మరించినప్పుడల్లా విశ్వనాధ వారి 'వేయిపడగలు' లోని ధర్మారావు గుర్తుకొస్తాడు. నిజంగా పేర్లు

ఒక్కటే, అంతటికవీ – పండితుడా! తన భర్త. అతనికున్న తెలివితేటలుగాని, ఆ సౌకర్యంగాని, ఆ మనోదారుఢ్యంగాని, ఆ విశాల దృక్పథంగాని, ఆ పరోపకార బుద్ధిగాని, అంతటి స్నేహపాత్రత – విశ్వాసం – దైవభక్తి – ఓర్పుగాని, తను అగ్ని సాక్షిగా పెళ్లాడిన ధర్మారావులోవున్నయ్యా! ఉంటే విశ్వనాథవారి ధర్మారావు నెందుకు కోనియాడటం? సుఖాన్నే అనుభవించేదాన్నిగా! యిన్ని విముక్తాలోచనలు తన హృదయంలో ఎందుకు తలెత్తుతయి? యింతటి ఆవేదన ఎందుకు క్రుంగిపోయేలాగు చేస్తుంది? అయినా యిదంతా నా పిచ్చిగాని, విశ్వనాథవారి ధర్మారావు నా లాంటి తక్కువ నోములు నోచుకొన్న ఆడదానికి నిజంగా లభిస్తాడా? ఏ అరుంధతికో అందుతాడు. కనీసం తన పేరు 'అరుంధతి' అని వున్నా బాగుండేదేమో! ఆ పేరునన్నా తల్చుకోడానికి ఆస్కారము – అర్హతా వుండేవి. అలాంటివేవీకూడా లేకుండా చేయడానికేనేమో! తన పేరు 'జయలక్ష్మి' అని పెట్టారు. పెట్టారు. బాగుంది. ఏంలాభం? ఏవిషయంలో జయం పొందాను? భయంతో గజగజ వణికి చస్తుంటే! నిత్యమూ భర్తను సుముఖంగా మార్చుకోవటంలో జయంపొందలేకపోయాను. అత్తమామలకి ఆప్యాయంగా సేవచేయటానికి నోచుకోలేకపోయాను. అత్తింట్లో తన పట్ల అనుక్షణమూ రేగే చిల్లరమాటల్నిగాని, అల్లరితనాన్నిగాని జయించలేకపోయాను. తనను క్షణక్షణానికి క్రుంగతీసే బాధాకలిత స్వాంతనాన్ని జయించలేకపోతున్నాను. తెల్లారిన దగ్గరనుంచి, ప్రొద్దువాటారేవరకు ఎదురు తిరిగే నిష్ఠూరపు కష్టాల్ని నిలబడి పోరాడి, గెలువలేకపోతున్నాను. తలవాచేటట్లు మాటలంటున్న అత్తగార్ని ఓర్పుతో 'అత్తయ్యగారూ!' అని పిలవటం తప్పటంలేదు. పోని పిలుస్తున్నదాన్ని ఎలాగు పిలుస్తున్నాను.

"మీరుకూడా నన్నిలా మనసు కష్టపెడితే, యిక యీ యింట్లో నన్నోదార్చేవారెవరు? నేనేం తప్పు చేస్తూన్నానని మీరిలా ఆడిపోయటం? కోడలిగా చేసుకొంది నన్నీరీతిగా ఏడ్పించడానికేనా? 'నా' అనే దృష్టి మీకు లేకపోతే, నేనీయింట్లో సుఖంగా కాపురం చేయగలనా? నేను, నిన్న మొన్నటి వరకూ పరాయి సంబంధపు పిల్లనైనా, నేడు మీ కోడలిగా, మీయింట్లో కొచ్చి కాపురం చేస్తున్నాను. యిక నాయావజ్జీవితం మీ వుపచారాలకు - మీ కుటుంబ క్షేమానికీ వినియోగపడవలసిందేగా! అలాంటప్పుడు నన్నెందుకు భేదభావంతో చూస్తారు.–" అని హృద్గతభావాన్ని సాయశక్తులా ప్రయత్నించి చెపుదామనుకొంటాను. కాని తీరికేది. చెప్పేంతవరకూ వింటారని నమ్మకం ఏమిటి? ఎలాగూ చెప్పలేకపోతున్నాను కాబట్టే, నా ప్రయత్నంలో నేనే ఓడిపోతున్నాను. జయమెట్లా సంభవిస్తుందిక? 'జయ'తో నాపేరు తునిగిపోతే, ఎంతోబాగుండేది. నా ఆలోచనలుకూడా తెగిపోయేవి. 'లక్ష్మి' అనికూడా చివర్లో తగిలించారు. ఏముంది లక్ష్మి నా తల్లి దండ్రులేమీ స్థితిమంతులు కారని నన్ను చూచిన ప్రతిముత్తయిదువా నా ముఖానే మాటవరుసగా అంటూనేవుంది. యిక అత్తగారి వ్యాఖ్యానానికి అంతేలేదు. పోనీ భర్తఏమైనా పెట్టాడా? "ఉన్నపుస్తెతాలూ కాబంగారం పూరికే అరిగిపోవటం దేనికి మెళ్ళోవుండి" – అని పెట్టెలో దాయమని సలహాయిచ్చేవారైనారు. పసుపుకొమ్ము కట్టుకొని, మెడిలో సతమతమై పొమ్మని యింట్లో గుసగుసలు. పోతే, తనసంగతి యింత తెలిసివుండి కూడా, తననే ఎందుకు చేసుకున్నారు...? "నా ముఖంలో కళవుంది –" జగన్నాథం సంబంధం చూసి అన్నమాట. ఏ నాటిదో? దానికోసం ధర్మారావు నాకు లభించాడు....తప్పులేదు...నాజీవితం అతనిపాదాలకు అంకితమైపోయింది. యిప్పుడెన్ని అనుకొంటేనేముంది? ... గతజల సేతుబంధనంవల్ల ప్రయోజనమేవిఁటి? జయలక్ష్మి ఒకనాటిరాత్రి - విరిసిన పండు వెన్నెలలో ఒంటరిగా పడుకొని, పదే పదే, తల్చుకొంటూ కలవరపడింది. తన జీవితానికి పట్టిన యీగాఢాంధకారం ఎప్పటికి సంపూర్తిగా విడివిపోనున్నదోనని ఓర్పుగా భావించి,

ఆ రాత్రికి కలత హృదయంతో కన్నుమూసి పడుకొంది.

ఇంతటి విషమస్థితిలో కూడా ధర్మారావు జయలక్ష్మిని 'నా' అనే భావనతో పలకరించలేకపోయాడు. క్రొత్త కాపురంలో ఎన్నో మధురాతి మధురమైన భావాలు పొదగబడి వుంటాయి. అలాంటివాటి నేవీ కోరకుండానే ధర్మారావు ఎడ ఎడంగా వుంటూవస్తున్నాడు. మూడునాళ్ల ముచ్చట కేవలం అతి కష్టంమీద జరిగింది. ప్రతి పురుషుని జీవితానికి ఆ మూడునాళ్లూ మహా ముచ్చటైన రోజులు. జీవితంలో పనేమీ మరువలేని మధురఘడియలవి. మర్చిపోదామనుకున్నా ఏకోశానా మరుపుకొచ్చేవి కావు ... అలాంటివి ఎందుకో ధర్మారావుకి గుర్తే లేవు. భార్యతో మురిపెంగా మాట్లాడితే, ఎక్కడ మల్లెపూలుకొని తేవాల్సొస్తుందోనని జంకుతూ వుండేవాడు. తల్లితో సంప్రదించి ఒక గదిలో పక్క వేయమని, జయలక్ష్మితో చెప్పడానికి ధైర్యం గుండెలో వుండేదిగాదు. లాలనగా చూస్తూ - నవ్వుతూ దగ్గరకు తీసుకొన్న కొద్దీ - స్త్రీహృదయంలో తీరని కోరికలెన్నో పుడతాయని అపార్థం చేసుకొని అంటీ అంటనట్లు యింట్లో ప్రవర్తించేవాడు. దీనికితోడు తల్లిదండ్రుల మధ్య ఆరనిమంట నిత్యమూ జ్వలిస్తూండేది. అటూ - యిటూ రేగిన కల్లోలానికి పరిష్కారం వెతకటం చాతకాక, స్తబ్ధుగా వూరుకుండి పోయేవాడు.

ఇంటి పరిస్థితులు దారుణరూపం తాల్చినయి. జయలక్ష్మికి చాకిరీ యెక్కువైంది. అస్తమానమూ దుర్గమ్మ శుచీ — శుభ్రమంటూ చేసినపనినే పదిసార్లు చేయటం మొదలెట్టింది. మాటిమాటికి అది ముట్టుకున్నాను, యిది తాకినాను అని నూతివద్ద రొచ్చయ్యేలాగు స్నానాలుచేయటం ఎక్కువైంది. అటు జయలక్ష్మికి యేపనీతీరేదిగాదు. యిటు దుర్గమ్మకి వంటపని పూర్తయ్యేదిగాదు. తిండి తినేసరికి ప్రొద్దు నడినెత్తిమీద కొచ్చేస్తూండేది. 'అదేమిటీ!' అని అడిగే నాథుడు నిగ్గదీసి అడిగితేగా! వంట పెందలాడే అయి కూళ్లు తింటానికి. 'పెట్టినప్పుడే ఎంగిలిపడదామని' తండ్రీ కొడుకులతోపాటు జయలక్ష్మి నకనకలాడుతూ వుండేవాళ్లు. వీళ్ళ కిట్లా కడుపుమాడే లాగుచేయటంలో, తనకున్న అక్కసు కొంత తీరిపోతున్నట్లుగా దుర్గమ్మ భావించేది. ఒకనాడు ధర్మారావు వుండబట్టలేక తల్లిని వాలుగా అడుగుదామనుకున్నాడు. కాని గుండె నిబ్బరం అంతలోనే దిగజారిపోయింది. ఒకవైపు ఆకలితో కడుపు మండిపోతోంది. మరోవైపు కని, పెంచిన తండ్రి 'యీసురో'మంటూ వాకిటి వసారాలో నిరుత్సాహంగా వాలు కుర్చీలో జారగిలబడివున్నాడు. చాకిరితో పొద్దున్నుంచి వేసారిన భార్య దొడ్డివేపు గుమ్మంలో నకనకలాడుతూ కొనవూపిరితో వుంది. ప్రొద్దు నడినెత్తిదాటింది. తీర్చినట్లుగా ఎండ తీవ్రంగా కాస్తోంది. ధర్మారావు తెగించి తల్లిని చెడామడా అడుగుదామనుకున్నాడు మళ్లా, జారిన ధైర్యాన్ని గుండెల్లోకి తీసుకొని, సరాసరి వంటింట్లోకి వెళ్లి చూసాడు. దుర్గమ్మ లేదు. పొయ్యిమీద ఎసరు కాగుతోంది. యేకూరా — నారా వండినట్లే లేదు. ఏపచ్చడి చేసినట్లూ లేదు. చారు — పులుసు తాలూకు వాసనలుకూడ అసలే లేవు. కడుపు మరీ మండిపోయింది. దొడ్లోకివెళ్ళిచూశాడు. దుర్గమ్మ యింకా మందకొడిగా మడిబట్టలారవేస్తోంది. కడిగి, బుట్టకెయ్యవలసిన బియ్యం యింకా ఆ పాళానే కడక్కుండానే వున్నయి. 'తన తల్లి యింత నిర్దయురాలైందేం?' ఎందుకో అప్రయత్నంగా యీ ప్రశ్న కలకవేసింది, ఉండబట్టలేక —

(సశేషము)

# మాళవిక

శ్రీమతి దేశిరాజు భారతీదేవి



మాళవిక మహాకవి కాళిదాస రచిత మాళవికాగ్నిమిత్రమను నాటకమునందలి స్త్రీపాత్ర. ఈమెనే మన కథానాయికగా కవి వర్ణించియున్నాడు. ఈ నాటకము కాళిదాసు మహాకవి తన చిన్నతనములో రచించినట్లు దోచుచున్నది. శాకుంతల నాటకమున జూపిన కౌశలముగాని, కల్పనా ప్రాగల్భ్యముగాని, రసచమత్కృతులుగాని, యీ నాటకములో గానరావు. భావనిర్మలత, పాత్రపోషణలో వైదగ్ధ్యము, కథానాయకునియందుగాని, నాయికియందుగాని చూపట్టవు. భారతదేశ ప్రసిద్ధ మహాకవి కృతమగుటచే నీ నాటకమున కొన్ని కొన్ని సన్నివేశ కల్పనలలో నైపుణ్యము కన్పించినను అగ్నిమిత్రుని కుండవలసిన ధీరోదాత్తతగాని, మాళవిక కుండవలసిన రాజపుత్రిక కుండవలసిన సహజ గంభీరత గాని మృగ్యమని చెప్పక తప్పదు. అగ్నిమిత్రుని పట్టమహిషియగు ధారణిపాత్రను మాత్రము పదవికి తగిన యుదార స్వభావము, బుద్ధివైశద్యము, సహజ గంభీరత ప్రస్ఫుటముగా చిత్రింపబడినది.

ఈ నాటకమున చెప్పబడిన అగ్నిమిత్రుడు, అతని తండ్రి పుష్పమిత్రుడు విక్రమార్కునకు పూర్వము సుమారు 125–సంవత్సరముల నాడుండినట్లు చరిత్రాంశమైనందున యిప్పటి రెండువేల సంవత్సరములనాటి చరిత్ర మిది యనుట కేసందేహములేదు. ఆ కాలమున బహుభార్యాత్వము దూష్యముగా పరిగణింపబడలేదు. అంతేగాక రాజులు శాస్త్రచోదితమైన నీతివర్తనమునందేమాత్రము జాగ్రత వహింపలేదు. అందుచేతనే ధారణీదేవి పట్టపురాణియైయుండగా, భోగభార్య 'యిరావతి' యుండగా నగ్నిమిత్రుడు మాళవికను పొందగోరుటయు, అందుకు భార్య ధారణి సమ్మతించి తానే స్వయముగా మాళవికను తన భర్తకు సమర్పించుటయు సంభవించినది.

ఈ నాటకములో మాళవిక మాధవసేనుని సోదరియైనట్లును, అతడగ్నిమిత్రునితో సంబంధము నెఱపుటకై సోదరీ సహితుడై వచ్చుచుండ శత్రుసైన్యములు వారి నడ్డగించి యుద్ధమొనర్చుటయు, మాధవసేనుడు శత్రువులచే జిక్కుటయు, ఆ సందడిలో మాళవికయు, కౌశికియు తప్పించుకొనిపోవ మాళవిక ధారణిదేవి తమ్ముండగు వీరసేనుని చేతిలో బడుటయు, ఆతడు మాళవికను రక్షణకొఱకు అక్కగారి వద్దకు పంపినట్లును వర్ణింపబడినది. అందువలన మాళవిక రాజవంశ సంభూతయనియు, నిరాశ్రయయై యాపదలో

నున్నందున దైవికముగా ధారణీదేవిగారి ఆశ్రయము దొరకి యామె అనుగ్రహము నకు పాత్రమైనట్లును స్పష్టమగుచున్నది.

మాళవికయందు పట్టపుదేవికి నిండు దయా ప్రేమలుదయించెను. సంగీత నాట్యములు నేర్పించి యామెను విద్యావతిగ నొనర్పెడు ఔదార్యముతో గణదాసను నాట్యాచార్యుని యొద్ద శిక్షణ ప్రారంభించెను. మాళవిక చిత్ర ఫలకమును రచింప జేసి తనకడనుంచుకొనెను. మాళవిక అభిజాత్య సంపన్నతగల రాచకన్నియయని తెలియకున్నను, ధారణీదేవి యాపిల్ల యందవ్యాజప్రేమ వహించి, ఆమె విద్యాభివృద్ధియందత్యంత శ్రద్ధతో నుండెను. అంతియేగాదు మాళవిక రాజుగారి దృష్టిపథమున బడకుండునట్లుగూడ జాగరూకత వహించెను.

ఇట్లుండగా నీ నాటక కథా నాయకుండగు రాజుకు మాళవికయందు ప్రేమాంకురములో కేవల మోహాంకురములో పుట్టుటకొక సన్నివేశము సంఘటిల్లెను. పట్టమహిషి తయారీ చేయించిన చిత్రఫలకమామె చెంతనుండగా అకాత్తుగా రాజక్కడికివచ్చి యా చిత్రము చూచెను. ఆఫలకచిత్రిత యువతీ సౌందర్యముచే ముగ్ధుడయ్యెను. ఆ చిత్రఫలక మెవ్వరిదని భార్య నడిగెను. ఆమె చెప్పుటకు సందేహించుచుండగా రాజపుత్రికయగు "వసులక్ష్మి"యను బాలిక మాళవికదని అమాయకముగా జెప్పివైచెను. ఆచిత్రపట దర్శనమే రాజుకు మాళవికయందను రాగముగల్గుటయు, తత్పట చిత్రిత యువతీ సందర్శనముచేయ కుతూహలము గల్గుటయు, సంభవించినది. అప్పటి నుండియు రాజునకు గల్గిన మనోవికారము చెప్పనలవిగాదు.

ఇక మాళవికను చూతము. ఈమె రాజపుత్రిక. ఈమె . నగ్నిమిత్రునకిచ్చి వివాహమొనర్ప నిశ్చయించియే అన్నయగు మాధవసేనుడామెను దోడ్కొని వచ్చుచుండగా మధ్యలో నాపదసంభవించుటయు, దైవానుగ్రహమున తానగ్నిమిత్రుని అంతఃపురముననే చేరుటయు, పట్టమహిషియగు ధారణీదేవి దయకు పాత్రురాలగుటయు సమకూడినవి. అప్పటి యామెహృదయ మేవిధముగానుండెనో యించుకపరికింతము. తనకు భర్తగా నిర్దేసింపబడిన రాజుగారికా! తన సంగతి తెలియదు. ఆతని భార్యయే తనకు రక్షకురాలు, తన అన్నగారగు మాధవసేనుడా- శతృహస్తగతుడు. తాను పరాధీన. ఇట్టి క్లిష్ట పరిస్థితిలో నిస్సహాయురాలైన మాళవిక తనమనస్సు రాజుగారికెట్లెఱుకజేయును? సమయమునకు నిరీక్షించుచుండుటేగదా చేయగల్గునది!

ఇట్లుండ నామె యదృష్టము పండినదో

యనునట్లు రాజామె చిత్రపటమునుగాంచుటయు ఆమె దర్శనమునకై వేడుక చెలికాడగు విదూషకుని తంత్రమువలన మాళవిక నాట్య విద్యా ప్రదర్శనము నేర్పాటు చేయుటయు సమకూడినవి. ఈ సందర్భములో తన నాట్య విద్యా నైపుణ్యమును ప్రదర్శించుచు తన హృదయమును రాజుకు నివేదించుకొన్నది మాళవిక. నాట్యశాలయందు మాళవికను గాంచి తనకోరిక లీరికలెత్త తన విదూషకుని ద్వారా తనయనురాగమామెకు తెలియజేసెను రాజు. ఆమెయు తనకది యొక మహాభాగ్యమని యెంచి రాజుగారియెడ ప్రేమ వహించెను కాని మానసమత్యంత సంశయగ్రస్తమై యుండెను. రాజునకు తనయందనురాగమున్నను, తన కాతనియందు ప్రేమయున్నను. రాజు తనకు దుర్లభుడను సంశయ మామెను పీడించుచుండెను. అందువల్ల మాళవిక హృద్గత భావము రాజునకు బహిరంగము చేయుటకామె జంకెను. పరాధీనయగు తాను ధారణీదేవికి వ్యతిరేకముగా ప్రవర్తించి యామెమనస్సు నొప్పించుటకిష్టములేదు. కృతజ్ఞతగలయే వ్యక్తియు రాణికి కోపకారణమైన యేపనియుచేయజాలదుగదా? అదియుగాక రాజుకు "ఇరావతి" యను భోగభార్యకూడగలదు. ఆమె కసూయగలుటగూడ సంభవించును గదా? ఇట్టి సంధిగ్ధస్థితిలోనున్న మాళవికకు ధారణీదేవి అశోక వృక్ష తాడనము చేయనాజ్ఞాపించినది. అయిదు దినములలో నావృక్షము మొగ్గదొడగినయెడల మాళవిక కోరిన కోరిక నెరవేర్తునను వరమామెకు ప్రసాదించి, తన పాదనూపురములామెకు ధరింపజేసి యుద్యానవనమున కంపినది.

ఈ వరమామె కత్యంత సంతోషము గల్గింప రాజుగారి దర్శనభాగ్యము లభించునుపాయము దొరికినదిగదాయని యువ్విళ్లూరుచు వెళ్లి వృక్షతాడన కార్యక్రమమారంభించినది. మాళవికాసమాగమమున కమితాతురత జెందియున్న రాజుకూడ నచ్చోటి కరుదెంచెను. ఈ సన్నివేశమున రాజు తన ప్రయత్నము సాఫల్యమయ్యెనని సంతోషముతోనుండెను. కాని భోగభార్యయగు "ఇరావతి" కూడ నచ్చటికే వచ్చి వారిసంభాషణ నాలకించుటయు, మాళవికాగ్నిమిత్రులపై కోపమువహించి, ధారణీదేవికడకేగి మాళవికపై నేరారోపణజేసి, యామె కాగ్రహము గల్గించి, చెఱసాలలో మాళవికను బంధింపజేసెను. పాపము మాళవికకు విషాదపరిస్థితి యేర్పడినది. తన్నాదరముతో చూచుచు, ఆశ్రయమిచ్చిన ధారణీదేవియే తనకు చెఱసాలశిక్ష విధించి నిర్బంధించుట మాళవికకు దుస్సహమగు సంఘటనగదా ?

ఇచ్చట మాళవికనుగూర్చి చిన్న విష

యము చెప్పవలసియున్నది. వివాహాము నకు పూర్వమే అగ్నిమిత్రునితో నేకాంత సమాగమము గోరినది. రాజుతో సమావేశమున కామె జూపిన తొందరపాటు జూడ రాజపుత్రికా గాంభీర్యమాపాత్రలో మృగ్యమని చెప్పక తప్పదు. ఈ తొందరపాటు హిందూసాంప్రదాయమునకు విరుద్ధమే. మాళవిక విద్యావతియు, నాట్య, సంగీత శాస్త్రప్రవీణయు సహనశీలయునని ఒప్పికొనక తప్పదు. కాని రాచబిడ్డకుండవలసిన ధీర గాంభీర్యములీఘట్టములో లోపించినవని చెప్పుట సాహసముగాదు.

అపుడామె రాజునుగూర్చి తలపోయజొచ్చినది. అతని వర్తన విచారించినచో నతడు తాత్కాలికావేశపూరితుడా ? లేక తన్ను వివాహమాడు సదుద్దేశముగలవాడా? ఈ సంశయ మామెను కలవరపెట్టినది. రాజు ధీరుడుగా కనుపింపలేదు. తన యెదుటనే "ఇరావతి" రాజుపై నాగ్రహించి చివాట్లుపెట్టిన సందర్భములో "రాణిగారి చెలికత్తెలతో వినోదముకొఱకు మాట్లాడుటతప్పా ?" అన్నాడు. విదూషకుడు మాత్రమే "ఇరావతి"కి బదులుప్రశ్న వేయగల్గినాడు. కాని రాజా మాత్రమైన అడుగలేకపోయినాడు. "ఇరావతి"ని బ్రతిమాల నారంభించినాడు. ఇట్టి అస్వతంత్రుడగు రాజు తన్నేమి రక్షింపగలడు ? విదూషకుడు మాత్రమే "ఇరావతి"ని వ్యంగ్యముగా భయపెట్టినాడు. "భర్తగారి దాక్షిణ్యము నిరాకరించుచున్నావా ?" యని మందలించినాడు. అంటే ఆయన దక్షిణనాయకుడను విషయము విస్మరించెదవా ? యను సూచన. దక్షిణ నాయకత్వలక్షణము పెక్కండ్రు భార్యలున్నను యెవ్వరికిని కోపము తెప్పింపనొల్లక యెల్లరను సంతోషపరచుటయేగదా ! విదూషకుని సూచనవల్ల మాళవికకుగూడ "ఇరావతి" పట్ల రాజు చూపిన సహనభావమునకు కారణము ద్యోతకమైనది. అస్వతంత్రత వల్లగాదని తెలిసికొన్నది. కాని ప్రౌఢగాక జవ్వనియగు మాళవిక కంత సహన విచారణ సాధ్యముగాదు.

అట్లు నిర్బంధములోనున్న మాళవికకు మరొక అగ్నిపరీక్ష సంభవించినది. విదూషకుడు తన యుపాయముచే నామెను బంధవిముక్తనుగావించి, సముద్రగృహమున జేర్చి అగ్నిమిత్రునితో పునస్సమాగమము గల్గించెను. ఈ మారుగూడ "ఇరావతి" అచ్చట ప్రత్యక్షము. మరల రాజుగారికి చివాట్లు తప్పలేదు. ఈ రెండవమారైనను ఫలప్రాప్తిగల్గక అంతరాయము గల్గుటచే నిక ధారణీదేవిగారి యాగ్రహమున కెటగావలెనేమోయని చింతావ్యాకులిత చిత్తయైనది. అదృష్టవశమున నింతలో కాంచనాశోక వృక్షము పుష్పించినది. ఆ వార్తతో ధారణీదేవిగారి కోపము

మాయమైపోయి మాళవికయెడ వాత్సల్యము గల్గి తానామెకు గావించిన వాగ్దానము నిల్పవలెనను సదుద్దేశముగల్గి మాళవిక నావరించి భర్తగారి కామెయందుగల ప్రేమ నెఱింగినది గావున తానే స్వయముగా నామెను భర్తగారి కర్పింపదలచి పండిత, కౌశికితో "అమ్మా అలంకార రచనయందు నీవు నిపుణవుగావున నీ నేర్పం తయుజూపి మాళవికకు వివాహాలంకారము గావింపు" మని చెప్పినది ఆమెయు నానందముతో వల్లెయని మాళవిక నలంకరించినది. కాంచనాశోక పుష్పోద్గమనసంపత్తిని రాజుగారితోగలసియే దర్శింపగోరుచున్నానని రాజుకవర్తమానమంపి, మాళవికను ముందుంచుకొని, పరివ్రాజకాసహితయై ధారణీదేవి వసంతోద్యానమున ప్రవేసించినది. రాజామెను సమీపింపగనే ధారణీదేవి చిరునవ్వుతో తన యుద్దేశము తెలియజేయుటకై "తరుణీజన సహాయుడవైన మీకీయశోక వృత్తము సంకేతగృహము చేయించినాననే" నర్మగర్భోక్తిగా నన్నదట. రాజా మాటల భావము గ్రహించి లజ్జనొందెనట. రాజు తన ప్రవర్తనకు తాను లజ్జింపవలసినదే.

ఇట్టి శుభసమయమున విదర్భరాజుగారంపిన కాంతలిద్దరు ప్రవేసించి కౌశికా, మాళవికలనుగాంచి వారి చారిత్రము విపులముగా చెప్పిరి. మాళవిక మాధవసేనుని సోదరియని తెలియగనే రాజవంశ సంభూతయగు మాళవికను తాను దాసిగా భావించితినని ధారణీదేవి పశ్చాత్తప్తయగును. మాళవిక నిజచారిత్రమువిని అచ్చటివారెల్ల నాశ్చర్యమగ్నులైరి. వెంటనే ధారణీదేవి మాళవిక నగ్నిమిత్రునకు సమర్పించి తనతో పాటు దేవీ గౌరవము నొసంగినది. ఎన్ని సంకటములతో గూడినను తుదకీ ప్రణయ గాధ మోదాంతమేయైనది.

ఈ నాటకమున ధారణీదేవి యౌదార్యము, సహనము, మొదలైన సద్గుణములు ప్రశంసనీయములుగా నున్నవి. చక్కని దృశ్యవర్ణనలు, మధురమగు భావములు, హృదయంగమమైన సంభాషణలు గల్గి చదువుట కింపుగ నేయున్నది. మాళవికాగ్నిమిత్రుల ప్రణయము ఫలించుటకు ముఖ్యకారణములీ నాటకమున వక్తలు గాక, కాంచనాశోక వృత్తమే కారణమని నిరూపించవచ్చు. కాళిదాసుయొక్క అపూర్వమైన క్రొత్తమార్గమే యిది.

(ఆలిండియా రేడియోవారి సౌజన్యముతో)

# కేనోపనిషదు

మూలం :
స్వామి చిన్మయానందజీ

అనువాదం.
డాక్టరు W. రాధాకృష్ణయ్య



## హెచ్చరిక

(ఆగస్టు సంచిక తరువాయి)

యచ్చక్షుషా న పశ్యతి యేన
చక్షూంషి పశ్యతి
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యది
దముపాసతే ॥ - 6.

ఏది కండ్లవలన చూడబడదో, దేనివలన కండ్లు చూచుచున్నవో అదియే బ్రహ్మమని తెలియుము. ఇచ్చట జనులు పూజించునదికాదు.

—o—

ముందటి మంత్రమునగల భావమును, కన్నుల ఉదాహరణముతో మరల తెలుపబడుచున్నది. కండ్లు బాహ్యప్రపంచమున విషయముల రూపవర్ణములు తెలుసుకొనుచున్నవి. కండ్లు చూడజాలవు. అవి చూచుకొరముట్లు. కండ్లతో చూచువాడు కంటికి వ్యతిరిక్తముగ నుండవలెను. కంటికి వెనుక వ్యవహరించు జ్ఞానఅంశము నిత్యకర్త అనబడును. వేదాంత సాధకుడు వెదకు మూలాధార సత్యము అదియే, అదియే బ్రహ్మమని తెలియుము.

యచ్ఛ్రోత్రేణ న శృణోతి యేన శ్రోత్ర
మిదం శ్రుతమ్
తదేవ బ్రహ్మ త్వం విద్ధినేదం యది
దముపాసతే ॥ – 7

ఏది చెవులవలన విననలవికాదో దేనివలనచెవులు వినుచున్నవో అదియే బ్రహ్మమని తెలియుము. ఇచ్చట జనులు పూజించునదికాదు.

—o—

ముందు తెలిపిన భావమునే శిష్యునికి విశదమగునట్లు మరొక ఉదాహరణముతో తెలుపబడుచున్నది. శరీరమునగల ఇంద్రియములు, మనసు, బుద్ధి పరిమితి గలవి. వీటివెనుక వ్యవహరించు జ్ఞానఅంశ మొకటి యున్నది. బ్రహ్మ చెవులను దాని విషయమగు శబ్దమువైపు మరల్చియున్నాడు. ఒక శవమున చెవులుండినను, అందు వినువాడులేడు కనుక శబ్దమును గ్రహించుటలేదు. ఒక గ్రామఫోను తన పాటనువిని ఆనందించజాలదు.

యత్ ప్రాణేన న ప్రాణితి యేన ప్రాణః
ప్రణీయతే
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యది
దముపాసతే ॥ – 8

ఏది ప్రాణముచేత శ్వాసింపబడదో, దేనివలన ప్రాణము శ్వాసించుచున్నదో, అదియే బ్రహ్మమని తెలియుము. ఇచ్చట జనులు పూజించునదికాదు.

—o—

ఉదాహరించుటలో ఇది కడపటిది. ఇంద్రియములన్నియు ప్రకృతి జన్యములు. అవి జడము. చైతన్య రహితము. వేదాంతమున ఆత్మ అనబడు జీవజ్యోతి యొక్క సంపర్కము పొందుటవలన చైతన్యమును ప్రకటించుచున్నవి.

ఒక ఇనుపముక్క నల్లగా నుండును. చల్లగ నుండును. దానిని అగ్నిలో ఉంచినచో అది ఎర్రగ మారును. ఉష్ణముగ నుండును. ఈ ఉష్ణము ఎరుపు దాని గుణములుకావు. అగ్నియొక్క గుణములు. అగ్ని

సంపర్కమువల్ల దానికి కలిగినవి. ఆదేరీతి జ్ఞానేంద్రియములలో చైతన్యములేదు. వాటికి ఆధారముగ నుండు చైతన్యము వాటికి శక్తి కలిగించినపుడు అవి విషయములను తెలుసుకొనుచున్నవి. అందువల్ల మనలోని జీవకేంద్రము వీటితో సంపర్కము పొందినపుడు అవి జీవకళను ప్రకటించుచున్నవి.

ఒక రాగికమ్మి మనకు అదిరింపుకలిగింపజాలదు. ఆ రాగికమ్మియందు కరెంటు ఉండినచో మనకు అదిరింపు కలిగించుచున్నది. ఈ అదిరింపు కమ్మి యొక్కగుణముకాదు. దానిలో వ్యాపించు కరెంటు యొక్కగుణము.

కేనోపనిషత్తునందు మొదటి ఖండము విమర్శించి యున్నాము. జీవవ్యవహారములకెల్ల మూలమగు ఆత్మను గురించి గురువు బోధించుచున్నాడు. మొదట కన్నుకు కన్ను, చెవికి చెవి, మనస్సుకు మనస్సుగా నుండునది ఆత్మ అని తెలిపి మరల, ఆత్మ కండ్లవలన చూడబడదు. ఆత్మ చైతన్యమువలన కండ్లు చూడ గలుగుచున్నవి. ప్రాణమువలన ఆత్మ శాసింపబడదు. ఆత్మ చైతన్యమువలన ప్రాణము శ్వాసించుచున్నది. మనసు ఆత్మను సమీపింపజాలదు. ఆత్మ చైతన్యము వలన మనసు చింతించగలుగుచున్నది అని తెలిపి యున్నాడు.

ఇట్లు వివిధరీతులవలన, కేంద్రములకు కేంద్రమగు ఆత్మను తెలుపుచు సర్వజ్ఞానములకు ఆత్మయే మూలాధారమని వర్ణించియున్నాడు.

పైవర్ణనయంతయు జ్ఞానేంద్రియముల వ్యవహారముల ననుసరించి, వర్ణించియున్నాడుగాని, ఆ జ్ఞాన స్వరూపమిట్టిదని, జీవుడిట్టివాడు అని తెలుపలేదు. తారతమ్యములనుబట్టి ఆత్మను నిర్ణయించు విధము తెలిపియున్నాడు. చూచు కండ్లు, విను చెవులు, కదలుచుండు ప్రాణము, మాటలాడు నాలుక, ఇవన్నియు మూలాధారశక్తియొకటి ప్రత్యేకముగ లేకున్న పనిచేయజాలవని స్పష్టమగుచున్నది. కాబట్టి వీటిని పనులలో, వ్యవహరింపజేయు జీవశక్తి ఒకటి యుండవలెను.

ఆ జీవశక్తి మనోబుద్ధి ఇంద్రియములద్వారా ప్రకాశించురీతి తెలిసియున్నది. వీటి వ్యవహారములెల్ల ఆత్మయొక్క ప్రతిబింబ స్వరూపములు. శ్రుతులలో తెలుపబడు ఆత్మయొక్క గుణములన్నియు, మనలోనున్న శుద్ధ సచ్చిదానంద స్వరూపుని బింబ దర్శనములు. ఆ గుణములు మనకు తెలుపబడుట గాని, మనము తెలుసుకొనుటగాని, ఈ మనోబుద్ధి ఇంద్రియములద్వారా సాధ్యమగుచున్నది. ఆత్మ వద్దకు శిష్యుని పిలుచుకొనిపోయి "అదుగో ఆత్మ" అని గురువు చూపజాలడు. అతడు ఆత్మ ప్రభావము ఇన్ని వివిధరీతుల ప్రకాశించుచున్నదని తెలుపగలడు.

ఈ మొదటి ఖండమున ఇదివరకు, ఆత్మయొక్క వ్యక్తరూపమును వర్ణించబడియున్నది. అవ్యక్త, శుద్ధ పరబ్రహ్మ ఆత్మ స్వరూపమును వర్ణింపబడియుండలేదు. ఆద్యంతరహిత ఆత్మ, ఆద్యంత సహిత భావములోనుకాదు. మాటలవల్ల ఆత్మ స్వరూపము తెలుపజాలము. ఈ కార్యమున భావశక్తి హీనమగుచున్నది. కనుక వ్యక్త ఆత్మను వర్ణించుట మాత్రము సాధ్యమగుచున్నది.

## ద్వితీయ ఖండము

ఓం యది మన్యసే సువేదేతి దభ్రమేవాపి
నూనం త్వం వేత్థ,
బ్రహ్మణోరూపం యదస్య త్వం
యదస్య దేవేష్వథ ను
మీమాంస్యమేవ తే; మన్యే
విదితమ్ ॥ - 1

గురువు శిష్యునికి హెచ్చరిక జేయుచున్నాడు:-

"నేను బాగుగా తెలుసుకొంటిని" అని నీవు తలచిన యెడల, నిజముగ అది అతిస్వల్పము. నీవు

తెలిసికొనిన బ్రహ్మస్వరూపముగాని, దేవతల స్వరూపముగాని అతిస్వల్పము. కనుక ఏది నీవు తెలుసుకొనదలచియున్నావో అది ఇంకను తెలుసుకొనవలసియేయున్నది.

—o—

శిష్యుని ముఖావలోకనమువల్ల, గురువు సందేహించియున్నాడు. ఇతడు తాను తెలుసుకొనిన దానితో తృప్తికలిగి సంతోషించుచున్నాడు, అను సందేహముకలిగెను. కనుక హెచ్చరిక చేయుచున్నాడు. "నీవు ఆత్మను తెలుసుకొనగలిగితివని తలచుచున్న యెడల, పట్టి వెఱ్ఱివాడవగుచున్నావు. కన్నుకు కన్నుగనుండునది ఆత్మ. స్వర్గ దేవతలకు కూడ చైతన్యముకలిగించునది ఆత్మ. ఇంతటి వర్ణనతో ఆత్మ తెలిసినదని తలచుట వెఱ్ఱితనము."

ఒక బీదవాడు రాజమహలును చేరి బైటివసారా చూచుటవల్లనే మహలునంతయు చూచితినని తలచుట పొరబాటు. అందువల్ల మహలు యొక్క ప్రభావము అతనికి తెలియదు. లోపలకి వెళ్ళి ఒకొక్క కూటమును చూచి, వాటి విశాలతను తెలుసుకొని అనుభవించవలెను. అటులనే ఆత్మను గూర్చి వినినంతనే తెలిసితినని పొరబడకూడదు. లోపల ప్రవేశించి, అంతటచుట్టి, గమనించి దృష్టించి విమర్శించి, మహలుయొక్క వైభవమును అనుభవించవలె. హృదయ గుహాయందుండు ఆత్మనుగురించి పరిపరి విమర్శచేయవలె. స్వానుభవము వల్ల సన్నిహిత జ్ఞానముపొంది వ్యక్తి ఆత్మయొక్క వికాసమును బుద్ధి ద్వారా తెలుసుకొనవలెను. ఆంతర శుద్ధ చైతన్యమువద్ద నివసించవలె. మనము వినునది, చూచునది అంతయు వ్యక్తరూప సత్యములు. శుద్ధసత్యము నామ రూపములకు అతీతముగానున్నది. శుద్ధ సత్యమెటు కను కనుగొనుటతో నామరూపములు లయముచెందుచున్నవి. శుద్ధసత్యమునకు బాహ్యమునయుండునదంతయు అస్థిరములు.

ఒక మహారాజు యొక్క ఉడుపులు చిలుకున వ్రేలాడుచుండు సమయమున రాజమహలులోని కనిష్ట ఉద్యోగికూడ దానికి నమస్కరించ తలచడు. నీ కోటు, నిజారు చిలుకకు వ్రేలాడునపుడు వాటిని నీభార్య ఆలింగనము చేయుటలేదు. నీ బిడ్డలువచ్చి కరచుకొనుటలేదు. ఒక పోలీసు ఉద్యోగి యొక్క ఉడుపులనుచూచి ఏ పోలీసుజవాను కూడ నమస్కరించుటలేదు. కాని, వీటిలో వీటి "స్వామి" వచ్చి చేరినవెంటనే అందరు గౌరవించుచున్నారు.

అదే విధముగ, ఈ స్థూల శరీరమున స్వామి - ఆత్మ - ఉండునంతకాలము దీనికి మర్యాద కలదు. అతడు బైటికి జారిపోగా, ఇది శవమయి, మర్యాద రహితమగుచున్నది.

మీలో యొకరు ఒక సందేహమును తెలిపియున్నారు. "దేహము మరణించునపుడు ఆత్మ చైతన్యము వెళ్ళిపోవుచున్నదనుచున్నారు. చైతన్యము వెళ్ళినా దేహము శవస్వరూపములో అస్థిత్వపొందియున్నదిగదా. దీనివల్ల చైతన్యము వెళ్లుట, అస్థిత్వము యుండుట ఎట్లు సమంజసమగును" అని సంశయము.

తొలుత ఇట్టి సంశయములు సామాన్యులకు కలుగదు. ఏ కొద్ది విచారపరులకు మాత్రము సందేహము కలుగుచుండును. దీనికి సమాధానమునకు ఒక ఉదాహరణము తెలిపెదను. ఒకగోడ సూర్య ప్రకాశమువల్ల కనబడుచున్నది. సూర్య ప్రకాశము దానిమీద పూర్తిగ వ్యాపించియున్నది. నేను ఒక అద్దమును తీసుకొని, సూర్య ప్రతిబింబము గోడమీద పడునట్లుచేసెదను. ఆ ప్రతిబింబము పడినచోటు, ఎటువైపుండినను అది మిగతభాగముల కన్న అధికప్రకాశముగ కనబడుచుండును.

అదే విధముగ సత్యము శుద్ధ అస్థిత్వము సర్వత్ర, సమవ్యాపకముగనున్నది. కాని అంతఃకరణమనబడు జీవునిద్వారా మనో బుద్ధులద్వారా ఆత్మప్రతిబింబము ప్రకాశించుచుండును. అంతఃకరణము వెడలిపోగా, ప్రత్యకాత్మ ప్రకాశము తొలగిపోవును. ఆ దేహము శవమగుచున్నది. కాని శవమునందలి

భాగములు సర్వవ్యాపక ఆత్మ అస్తిత్వమునసే యున్నవి. అవి మరిగి అందులోనే లయించుచున్నది.

చిలంతన యుండు చొక్కాలో ధరించు స్వామి లేదు. ఈ శరీరమున చైతన్యముండిన దీనికి పవిత్రత కలదు. ప్రభువను ఆత్మ వెడలిపోగా, ఈ దేహము అపవిత్రమయి కూలిపోవుచున్నది.

ఒకమానవునికి, మరి యొకనికి, ఒకమానవునికి, మృగములకుగల తారతమ్యము, ఆత్మ అన్నిటి యందును ఏకముగనుండినను, ప్రతిబింబముకలుగ అంతఃకరణ దోషమువలన భేదము లేర్పడుచున్నది. కొన్ని అద్దములు మైలగనుండును, కొన్ని శుభ్రముగ నుండును. కొన్ని లోనికి వర్తులముగయుండును. కొన్ని బైటికి వర్తులముగనుండును. నీకును నీ సోదరులకు నీ మేనమామలకు గల భేదమువలెనుండును.

ద్వైతమంతయు వ్యక్త స్వరూపమునసేయుండును. బింబములు ఎన్ని అగుపడినను, సూర్యుడు ఒకడే. మనసు, బుద్ధి, ఇంద్రియములకు అతీతముగ యుండి తనప్రకాశము వాటికి యొసగుచు, ఆత్మ ప్రకాశించు చున్నాడు. అన్ని వ్యాఖ్యానములు, బోధలు వివరణలు శ్రుతులు, గురువులు తెలుపునదంతయు, వ్యక్త ఆత్మనుగురించి తెలుపుచున్నవి. శుద్ధ ఆత్మను, శిష్యుడు తనకుతానే,అపరోక్షముగ తెలుసుకొనవలెను.

మా గురుదేవుడు అనేక పర్యాయములు, పాఠము ముగియుసమయమున, "మన విచారమంతయు వ్యక్త ఆత్మను గురించి జరుగుచున్నది. ఈవ్యక్తమునకుగల పరిణామమును తొలగించి మీరు ఆత్మను తెలుసుకొన వలెను" అని చెప్పుచుండిరి. చిన్మయునకు సంశయము అధికమయి, "స్వామీ! మీరే ఆ వ్యక్తమునకు గల పరిణామమును తొలగించి శుద్ధ బ్రహ్మను విమర్శించకూడదా" కంటికికన్ను. అనుటలో ఆ కన్నును తొలగించి ఆత్మను చూపకూడాదా?" అని ప్రశ్నించెను. తగు ఉత్తరములేదు. సత్సంగమ్ము జరుగుచుండెను. చిన్మయునిసందేహము మరిగిపోవుచుండెను.

అకస్మాత్తుగా, శ్రీ గురుదేవుడు, "చిన్నయా! త్రాగను కొంతనీళ్లు తెమ్మ" అనిచెప్పెను. ఆ చలి కాలమున, గంగోత్రి తీరము, వేకువజామున దాహము కలుగుట ఆశ్చర్యకరముగనున్నను చిన్నయుడు ఒక లోటాతో నీళ్లుతెచ్చి గురుదేవునిముందుంచెను.

గురువు కోపముతో "ఇదేమిటిది"అని అడిగెను. "స్వామీ! మీరు కోరిననీళ్లు." అని శిష్యుడు మెల్లగ చెప్పెను.

"నేను నీళ్లు తెమ్మంటినా? లోటా తెమ్మంటినా? లోటా తీసుకొనివెళ్లి నీళ్లు తీసుకొనిరా"

"స్వామీ - లోటా లేక - నీళ్లు - తెచ్చుట - లోటా!" అని తన దిగ్భ్రమ కనుపరచెను.

"చింత అక్కరలేదు" అని ఓదార్పుమాట తెలిపి, "పాత్రలేక నీళ్లు ఎవరును తేజాలరు. అదేవిధముగ ఆత్మజ్ఞానమును తెలుపుటయందు శుద్ధ సత్యస్వరూపుని, మాటలతో తెలుపలేము. నీటిని పాత్రలేనిది తెచ్చుట సాధ్యముకాదు. అదేవిధముగ సత్యమును గురించి ఏదో యొక వ్యక్తపరిణామమువల్లనే తెలుప సాధ్యము. అందువల్ల గురువులుగాని, శ్రుతులుగాని, వ్యక్త ఆత్మనుగురించి తెలుపును. పరిపూర్ణ ఆత్మనుగురించి కాదు."

వ్యక్త బ్రహ్మస్వరూపమును గురించి ఎంతవిచారించినను, మన గమ్యస్థానము చేరజాలము. మానవుడు తనకుగల బంధనములు పరిచ్ఛిన్నములనెల్ల తొలగించి దివ్య పదవియగు ఆత్మస్వరూప శిఖరమును పోయి చేరవలెను. ఇది సాధకుడు తన సన్నిహిత అనుభవముగ, బాహ్యమున కనబడు శాశ్వత సచ్చిదానందమే తన నిజస్వరూపమని అనుభవించవలెను.

ఇట్టి అపరోక్షానుభవము పొందుటకుగల కారణములు రెండు _ పరిశుద్ధ మనస్సు, బుద్ధి. చలన రహితమగు మనస్సును శుద్ధ మనస్సు అనబడును. మానసికరంగమునగల దుర్గుణములగు కోరికలు, క్రోధ

ములు, మోహములు, ఆశలువల్ల మనసున విక్షేపములు కలుగుచుండును. పూర్వవాసన ఫలితముగ మనస్సు బాహ్యప్రపంచమును చూచుచున్నది. ఒక సినిమా ఫిలిమునందుండు మరకలరీతి తెరమీద కథ ఏర్పడుచున్నది సినిమా చూచువారు బొమ్మలతో పూర్తి తాదాత్మ్యముపొంది, అందుకనబడు సుఖ దుఃఖములను అనుభవించుచున్నారు.

అదే విధముగ, మన యందలి పూర్వ వాసనలరీతి, బాహ్యప్రపంచ విషయముల అమరికను చూచుచున్నాము. ప్రపంచముతో తాదాత్మ్యముకలిగించుకొని దుఃఖించుచు, నవ్వుచు, సుఖము, దుఃఖము, నాట్యము, రోదనము, చేయుచున్నాము. ఆశాపాశలకు, జయాపజయములకు, లాభనష్టములకు మధ్య మానవుడు జీవిత పరిమిత దుఃఖముల ననుభవించుచున్నాడు.

సినిమా చిత్రమున కనబడు నాయకులు ఎంతటి సత్యత్వముకలిగియున్నారో, బాహ్యప్రపంచ విషయముల సత్యత్వముకూడ అటులనేయున్నది.

మన దృష్టి బాహ్య ప్రపంచమున పూర్తిగ మగ్నమైయుండునపుడు తేజోవంతమయిన సన్నిహిత ఆత్మానుభవము అపరోక్షముగ కలుగుట అసంభవము. మనసునందుండు వాసనలను తొలగించవలెను. శుద్ధ మనసు ఎట్టి కథలను కల్పింపజాలదు. దానిఫలితముగ ప్రపంచవ్యవహారములు జరుగుచుండినను ఆత్మ ఎఱుకను వదలకయుండగలము.

నిత్యనిరంతర నామ సంకీర్తనమనబడు భక్తి సాధన వల్ల మనసును శుద్ధపరుపవచ్చును. మనసునందుండు వాసనలను తొలగించి శుభ్రపరుపగల సాధన నిత్య నిరంతర ఈశ్వర స్మరణ యొకటియే.

నిర్మల మనసునందు దైవత్వము పరిపూర్ణ వైభవముతో తాండవమాడుచుండును. "తత్త్వమసి" ఒక ధూర్తుడు, పాపికూడ పరిపూర్ణపదవి పొందగలడు. "ఇచ్చట ఇప్పుడే"నని వేదాంత నమ్మకము – నిరంతర భగవన్నామ స్మరణతో జీవింపుము. మానసిక దుర్గుణములను దూరముచేయుము. శుద్ధ సత్యజీవనము గడుపుము. అందరికి సేవజేయుము. అందరిని ప్రేమించుము. దయకలిగియుండుము. పరిశుద్ధముగనుండుము. ఓర్పుగలిగియుండుము. శాంతముకలిగి యుండుము. శ్రద్ధకలిగియుండుము. హద్దులేని ప్రేమరసముతో జీవించుము. భగవంతుని శరణజొచ్చి, స్వార్థమును తొలగించుము. నీ దివ్యసహజస్థితిని పొందుము. సేవ చేయుము. ప్రేమించుము, పరిశుద్ధముగనుండుము. ధ్యానించుము. భగవత్సాక్షాత్కారము పొందుము. నిరంతర నారాయణ స్మరణ దీనికి చక్కనిమార్గము

—o—

## నిర్మల ఆత్మ

అగ్నియందు వేయబడిన వస్తువులను, అగ్ని కాల్చును. కాని అగ్ని అగ్నినికాల్చజాలదు. నీళ్లు ఇతరవస్తువులకు తేమకలిగించును. నీటికి తేమకలిగించజాలదు. గంగయందలి తీర్థము ప్రక్కనుండు బావిలోని నీళ్లను తడిచేయుచున్నదని చెప్పజాలము. అటులనే పరిపూర్ణ జ్ఞానము తన్ను తెలుసుకొనుటలేదు. పరబ్రహ్మ తన లీలవల్లనే తెలియబడడు.

గురువులిదివరకు తెలిపినదందయు వ్యక్తబ్రహ్మ స్వరూపమునుగురించి వర్ణించియున్నారు. ఆటస్థలమునందు బాలురు ఆడుకొందురు. ఆటస్థలమే ఆడుకొనుటలేదు. స్థలము ఆడజాలదు. పరబ్రహ్మమునందు జ్ఞానవ్యవహారములు జరుగుచున్నవి. నీవ్యవహారములు స్వయము పరబ్రహ్మమును చేరజాలవు. అందువల్లగురువుయొక్క హెచ్చరికను విచారించవలెను.

"ఆత్మను బాగుగ తెలియగలిగితినని యెంచవద్దు. అట్లు తలచిన వాడు అవివేకి" అని తెలుపుటయందు, వ్యక్త బ్రహ్మమును చక్కగ జాగరూకతతో విమర్శించ యవసరము కనబడుచున్నది. పిమ్మట శుద్ధ నిత్య ఆత్మయొక్క భావమును ఊహించగలుగుచున్నాము.

(సశేషము)

(512-వ పేజీ తరువాయి)

కృష్ణుని వాగ్ఝరీ జృంభణమ్ము,
ఉన్నతగుణుడు, దేశోద్ధారకుండగు
నాగేశ్వరరాయుని జ్ఞానపటిమ,
ఆంధ్రతావనియన్న యశము జెందిన రామ
యోగి, యచంచల త్యాగనిరతి
తోడ నిండార వెలసిన యీడులేని
ఆంధ్ర రాజకీయ చరిత్ర నాదిభాగ
పు దొలిసంపుటి సర్వము బూరియయ్యె –
ఆంధ్ర కేసరి నీ విప్పుడ స్తమింప."

అని కోట సోదరులు ప్రశంసలో వ్రాశారు.

ఆ తరువాత శ్రీ వేదాంత కవి కృతికర్తలను, కృతి భర్తను ప్రశంసిస్తూ పద్యరత్నాలు చెప్పారు.

శ్రీ నిడదవోలు వెంకట్రావుగారు ఆదర్శప్రాయముగ ఆంధ్రకేసరి జీవితసంగ్రహమైన ఈ 'ప్రకాశప్రభ' పద్యకృతి విశాలాంధ్ర దేశమున కళాశాలల్లో పఠనీయ గ్రంథముగా నొనర్చిన శ్రీ పంతులుగారి పవిత్ర నామము మనకు నిత్యస్మరణీయమై వారికొక శాశ్వత జ్ఞాపకచిహ్నమై విరాజిల్ల గలదని అన్నారు.

భౌతికముగా ప్రకాశము పడిన నేమి? ఆత్మలోని ప్రకాశము అణగిపోక యుగయుగమ్ములదాక మహోజ్వలముగ నాంధ్రయువకుని దేహ గేహమున వెలుగు అని చెప్పారు.

"ఆంధ్రులలోని సమస్త శక్తులు ప్రకాశంలో మూర్తీభవించాయనీ ఆంధ్ర సంస్కృతి ఇతరముల కంటె భిన్నమైనదని" పద్మశ్రీ మోటూరి సత్యనారాయణ చెప్పారు.

"భారతం ఒక్క తెలుగుదేశంలో తప్ప ఇతర ప్రాంతాలలో విరివిగా ప్రచారంలో లేదు. భారతం మొట్టమొదటగా తెలుగులోకే అనువాదం అయింది. కనుక అందులోని రాజనీతిని, సమస్తశక్తులను తెలుగుజాతి అలవరచుకుంది, భారతంలోని శక్తి అంతా ప్రకాశంలో మూర్తీభవించివుంది. పంచపాండవులకువున్న శక్తులేగాక కృష్ణునికివున్న జ్ఞానసంపదకూడా వారికివుంది. అందువలన వారిని జ్ఞాపకం చేసుకోవటం దేశంలోని అందరిని ప్రోత్సహించినట్లు అవుతుంది" అని సత్యనారాయణగారు అన్నారు.

శ్రీ యామిజాల పద్మనాభస్వామి మాట్లాడుతూ శ్రీ విశ్వనాథం స్థితప్రజ్ఞుడు, స్థితప్రజ్ఞుడని, ప్రకాశం జీవితచరిత్రను అంకితం అందుకునే అర్హత వారికి మాత్రమే వుందని అన్నారు.

శ్రీ జలగం సుబ్రహ్మణ్యంనాయుడు, డాక్టరు గిడుగు వెంకట సీతాపతి కృతికర్తలను, కృతిభర్తను, కావ్యమును ప్రశంసించారు.

సభాధ్యక్షులకు, సదస్యులకు, కృతికర్తలకు కృతజ్ఞత తెలిపి శ్రీ విశ్వనాథం ఇలా చెప్పారు. "నాకు ఇప్పటిమేగాని పుచ్చుకోవటం అలవాటు లేదన్నారు. అది వాస్తవం. కాని 60 వ పడివచ్చిన తరువాత పుచ్చుకోవటం ఆరంభమైంది. నాలోట్లు నాకు తెలుసును. ఇతరుల మనస్సును కించపరచకూడదని చెప్పి స్వీకరిస్తున్నాను. ప్రకాశంగారియందు గల మీ అభిమానం నా మీద ప్రసరించింది. ప్రకాశం చరిత్ర చాలా గొప్పది. నా కంటె వారినిగూర్చి తెలిసినవారు అనేకమందివున్నారు. వారు నన్నెన్నడూ ఫలానా విధంగా చేయమని చెప్పలేదు. ప్రజా సమస్యలలో వారి నిర్ణయాలు, కార్యక్రమం నా భావాలకు అనుగుణముగావున్నందున వారిని అనుసరించే వాడిని. కొంత కాలానికి వారి నిర్ణయాల్లో తప్పువుండదని నమ్మకంకలిగి వారుచెప్పినట్లు చేసే వాడిని. అయితే వారు ప్రతివిషయంలో రెండు దశాబ్దాలు ముందడుగు వేస్తూవుండేవారు. అందువలన ప్రజలు వారిని పూర్తిగా అర్థం చేసుకోలేక పోయారు. ఇప్పుడు ఏమిచేస్తే బాగుంటుందనుకుంటున్నారో దానిని వారు 1937-38లోనే చెప్పారు."

శ్రీ విశ్వనాథం కోటసోదరుల కృషిని అభినందించారు.

సినీనటుడు శ్రీ లింగమూర్తిగారు వందన సమర్పణము చేసారు.

ఇమిటేషన్ రాజుగారి వినోద కార్యక్రమంతో కార్యక్రమం ముగిసింది.




ఈ నెలలో విడుదలయిన జెమినీవారి 'విజయకోట వీరుడు' చిత్రం ఆంధ్రదేశంలో జైత్రయాత్ర చేస్తున్నది. ప్రఖ్యాత జంట వైజయంతిమాల, పద్మిని నృత్యములు, జమినీగణేశన్, వీరప్పల కత్తియుద్ధాలు, పి. కన్నాంబ, టి. కె. షణ్ముగం, తంగవేలు, విజయకుమారి, ముత్తులక్ష్మి మొదలగు నటీనటుల నటనాకౌశలము వినోద కాలక్షేపాన్ని కలిగిస్తూ ఆకర్షణీయంగా రూపొందిన దీచిత్రము. ఈ మహోజ్వల చిత్రానికి శ్రీ యస్. యస్. వాసన్ దర్శకులు.

◆ ◆ ◆

అనుపమా ఫిల్మ్స్ వారి 'అత్త ఒకింటి కోడలే' చిత్రం చక్కగా నిర్మితమయింది. ఈ చిత్రంయొక్క దర్శకత్వము ఉత్తమస్థాయినందుకున్నది. నటన, సంగీతం, రచన, ఛాయాగ్రహణము బాగున్నాయి. ఇందులో జగ్గయ్య, గిరిజ, రమణమూర్తి, రమణారెడ్డి, హేమలత, సూర్యకాంతం మొదలగు వారు నటించారు. దర్శకులు తిలక్. సంగీతం పెండ్యాల.

◆ ◆ ◆

విజయావారి 'అప్పుచేసి పప్పుకూడు' చిత్రంలో సావిత్రి, రామారావు, రేలంగి నటిస్తున్నారు. దర్శకుడు ప్రసాద్. సంగీతం రాజేశ్వరరావు. ఇది డిశంబరు నెలాఖరుకు విడుదలకావచ్చు.

◆ ◆ ◆

ఆచార్యవినోబాభావే నిర్వహిస్తున్న చరిత్రాత్మకమైన భూదానోద్యమ విశిష్టతను వివరించే దృశ్యాలతో విడుదలయిన ఫిల్మ్సశాఖ డాక్యుమెంటరీ చిత్రము భూదానోద్యమ వ్యాప్తికి ఎంతైనా తోడ్పడగలదు.

◆ ◆ ◆

ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్‌వారు తయారుచేస్తున్న 'ఇల్లరికం' పూర్తి అయినది. ఇందులో A. నాగేశ్వరరావు, జమున మొదలగువారు నటించారు.

◆ ◆ ◆

'నేతాజీ' జీవిత చిత్రమును హిరణ్మయసేన్ నిర్మించాలని నేతాజీ సుభాష్‌చంద్రబోస్ అమూల్య జీవిత సన్నివేశాలను, సంఘటనలను, ఆయనతో సన్నిహిత సంబంధమున్న వారిలో సంప్రతించి సేకరించ పూనుకున్నట్లు వింటున్నాము.

◆ ◆ ◆

ఈ నెల 5వ తేదిన మద్రాసు వాణీమహలులో శ్రీ వింజమూరి లక్ష్మీనరసింహారావుగారు తాను రచించిన 'నా నాటకరంగానుభవము' గ్రంథమును ప్రఖ్యాత సినిమానటుడు శ్రీ అక్కినేని నాగేశ్వరరావుకు వేదపారాయణం, మంగళవాయిద్యములతో అంకితమిచ్చారు. ఈ సందర్భమున కవిసన్మానము జరిగినది. కవులు, పండితులు, పెద్దలు కృతికర్త, కృతిభర్తలను అభినందిస్తూ, ఆశీర్వదిస్తూ ఉపన్యసించారు. శ్రీ. A. నాగేశ్వరరావు కృతజ్ఞతను తెలుపుతూ నాటకకళ నుద్ధరించుటకని బెజవాడలో ఒక చక్కని రంగస్థల నిర్మాణానికి ఏర్పాట్లు జరుగుతున్నాయని, అందుకు తాను విశేషంగా తోడ్పడగలననియన్నారు.

కుమారి రత్నపాప నృత్య ప్రదర్శనంతో కృతి సమర్పణ మహోత్సవం ముగిసింది.

◆ ◆ ◆

దుర్గాఫిల్మ్స్ వారి 'పతిభక్తి' తెలుగుచిత్రం యావదాంధ్రదేశంలో విడుదలయింది. దీనికి దర్శకుడు శ్రీ A. భీమ్‌సింగ్

'భగవాన్‌దాస్'

# కామాయని

మూలం :

శ్రీ జయశంకరప్రసాదు

అనుసరణ :

శ్రీ కొంపెల్ల సోమేశ్వరశర్మ, బి. ఏ.

(గత సంచిక తరువాయి)

దౌర్బల్యమువలన ఆమె రూపము, వర్ణము, శోభ నశించి రేఖాచిత్ర సదృశయైనది. ఆమె నేల రాలిన నష్టమకరందకుసుమము కిరణచంద్రికా విహీనమైన ప్రాతఃకాల ప్రభాహీన చంద్రబింబము! ఆమె శరీరము సూర్య, చంద్ర తారకావిరహితమైన సాయం సంధ్య. ఆమె నిర్జన ప్రదేశమందు కనుపించు మూర్తీభవించినమౌనబాధ. ఆమె లోకమునందలి యస్పష్ట యుదాసీనత ! స్వయం వేదన ! ఒకసారి ఆమె తన గత జీవనమును జ్ఞప్తికి తెచ్చుకొన్నది. కష్టమయమైనను— ఆ యతీతకాలమెంత మధురమైనది ! దానిని తలచుకొని యామె — ఆశ్రయవిహీనుడైన వ్యక్తిగత జీవనపు మణిహారము తెగి చిందరవందరగా రాలిన రత్నముల నేరుకొనుచు సంతసించునట్లు లామె, ఒక్కొక్క ఘట్టమునే జ్ఞప్తికి తెచ్చుకొని, తత్ స్మృతులలో లీనమైనది.

మనువు తన్ను తిరస్కరించినను, శ్రద్ధమాత్ర మాతనిపై కుపితయై దుష్టయోచనల నొనర్చుటలేదు. "నేను ప్రియునిచే వంచితనైతిని. అయినను నా జీవితము నాతనికే యర్పించితిని. అదియొక్కటే నాలోని స్వాభిమాన వస్తువు. ఆహా, ప్రేమ ప్రభావమెంత బలీయమైనది. ప్రాణవినియమమే ప్రణయమను భయంకర వ్యాపారమున కాదిమూలము. ఎవరికి ప్రాణము నర్పింపదలతువో — త్రికరణ శుద్ధిగ నర్పింపుము. దానినొక పెట్టుబడిగ భావించి లాభము తీయజూడకుము. నీవు ప్రతిఫలము నొందవలెనని వాంఛింతువో — అది ఎన్నటికిని సఫలము కాజాలదు ! సంధ్య దినదినమును తన ప్రియతముడైన రవిని రాత్రి కర్పించుచు, తాను మాత్రము చెల్లాచెదరైన తారాగణములను పొందుచుండును. అయినను నిశలో లీనమైన సూర్యదేవునిపై ప్రతీకారమొనర్చుట కాలోచించదు.

శ్రద్ధ తన నవజాతశిశువైన 'మానవుని'తో నా కుటీరముననే దుఃఖమయ జీవితమును వ్యతీతమొనర్చుచుండెను. ఒకనాటి రాత్రమున నామె కొక విచిత్ర స్వప్నము వచ్చెను. ఆ కలలో నొక సుందర సువిశాల నగరమున మనువు నివసించుచున్నట్లామె కాంచినది. ఆ నగరమున నేలను, నింగిని ఏకమొనర్చు నున్నత భవనములున్నవి. అచ్చట భూములు పచ్చని పైరుల వ్యవసాయముతో కలకలలాడుచున్నవి. అచట లోహములను కరగించి, వింత వింత యాభరణములను, క్రొత్త క్రొత్త యస్త్రములను కర్మచారులు నిర్మించుచుండిరి. ఒక వంక మదగజముల ఘీంకారములతో, మరియొకవంక కన్యకామణుల కలరవగానములతో శోభాయమానమగుచున్న దివ్య భవనపు సింహద్వారములనుదాటి, సింహాసనాసీనుడైన మనువును కాంచినది. అతని హస్తమున సురాపాత్రమున్నది. చెంతనే 'ఇడ' నిలచి పాత్రమును మదిరాసముచే పూరించుచుండెను. మనువు మద్యపానమత్తుడై, 'పీత్వా పీత్వా పునఃపీత్వా' యానందమున మునిగి తేలుచు 'ఇడ'తో నిట్లనెను.

మనువు:—"ఇడా, ఇంక నేమైన చేయవలసినపని మిగిలి యున్నదా ? "

ఇడ:—"ఓ! అప్పుడే గడచి గట్టెక్కితినని తలపోయుచున్నావు కాబోలు నే! అయినచో నొకప్రశ్న— మనూ! జీవితముయొక్క సమస్త సాధనములను

స్వవశమొనర్చుకొన్నచో — నీ పని సఫలమైనట్లే. ఏమి? అది పూర్తియయ్యెనా?"

మనువు:—"లేదు. పూర్తికాలేదు. ఇడా! నా హృదయమందేదో కొఱత నన్ను బాధించుచునే యున్నది. నేనొక దేశమును నివాసముగా నేర్ప రచుకొంటిని. కాని, నా మనోదేశమున మాత్రము శూన్యమే దృశ్యమానమగుచున్నది ... ఇడా! నీ వెంతటి సౌందర్యవతివి! నీవు నా కండ్లకొక యాశవు. కాని ... నీపై నా కధికారమేమున్నది! నీ కనుబొమలు ప్రతిపద చంద్రమావలె వంకర తిరిగి క్రోధమును సూచించుచున్నవి. నీ నేత్రములందు మానభంగమునసురోధించు తీవ్ర సంకేతములు దృశ్యమానములగుచున్నవి. ఓ చేతనామయీ, నీవెవ్వరిదానవు! నీ సుందర ముఖమండలమునకు, చంచలనయనములకు అధికారి ఎవ్వరు?" వాసనాప్రేరితుడై మనువిట్లు ప్రసంగించుచుండగా, కామోత్తేజ ముద్రితమైన యాతని ముఖములోనికి చూచుచు, సావధాను నొనర్చి, "మనూ! నీవు ప్రజాపతివి, శక్తిగలవారందరును ప్రజలు - అయినచో, నీ విట్లు సందేహజనకములగు ప్రశ్నల నేల వేయుచుంటివో?" "నా హృదయరాజ్ఞీ! నేను ప్రజాపతినైనను, ప్రకాశము నర్థించు భిక్షుకుడను. ఒక్కసారి ... నీ మధురాధరామృతముతో, నా చిరతృష్ణ నెప్పుడు తీర్చుకొందునో — చెప్పు" అనుచునే మనువు ఇడను తన భుజములతో బలముగ నావరించి వశమొనర్చుకొనెను.

అదే క్షణమున ప్రళయదృశ్యములు మరల విద్యమానములైనవి. పృథ్వి కంపించి గడగడలాడినది. భయంకరమైన యార్త్రనాదములు వినవైనవి. ఇడ కూడ శరణోపాయమును వెదుకజొచ్చినది.

ఇడ మనువున కాత్మజ. ప్రజ ఆమెను మోహించిన పాపఫలితముననే ప్రళయకారియైన శాపము సిద్ధమైనది. సంహారరుద్రుడు తృతీయ నేత్రమును తెరచి, తాండవమునకై కాలినెత్తినాడు. ప్రకృతి భయభీతయైనది. ప్రజాకోటియంతయును, క్రోధముతో, నొక్కపెట్టునవచ్చి ప్రజాపతియైన మనుని ద్వారమును సమీపించెను. ఆ కోలాహలమునకు ద్వారపాలకులు భీతితో నియతి తప్పినారు. భయావహుడై మనువు రహస్యస్థలమున దాగెను. అచట నుండి "ఇడయే ప్రజకు నేతృత్వము వహించి, విప్లవము నడుపుచున్నట్లును, ఇది యంతయు ఆమె పన్నిన వ్యూహమేయని విశ్వసించినాడు మనువు. తనలోనంత స్థితమైన దుఃఖమునకు క్రోధమును జతపరచి "ద్వారమును బంధించుడు! ఎవ్వరిని లోనికి రానీయవలదు!" అని బిగ్గరగా నాజ్ఞాపించి మనువు శయన గృహమందు జొచ్చెను."

ఇది రమా నాటి స్వప్నకథ. ఇంతటిలో నామెకు మెలకువవచ్చినది. ఆమె కండ్లుతెరచి స్వప్నసందర్శిత ఘట్టములకు భీతిలి కంపించసాగెను. "అయ్యో, నా ప్రియుడింతటి కపటియయ్యెనా!" అని వగచుచు, ఆతని క్షేమమునకై దైవమును ప్రార్థించుచు, దుఃఖముతో నామె యా రాత్రి గడపెను.

(సశేషము)






**ఆంధ్రభారతి : శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి, భారతీనికేతన్ సుబ్బరామ శాస్త్రివీధి, మారుతీనగర్, విజయవాడ వెల రు. 1 - 25.**

ఇంపు సొంపుల గూర్పు గ్రంథకర్త కవితాధోరణి కీఖండకావ్య సంపుటి మరొక నిదర్శనము. ముఖ్యంగా ఆంధ్ర భారతి, రామదాసు, డొక్కా సీతమ్మ శీర్షికల యందలి కవిత హృదయరంజకముగా రసపుష్టికలిగి సరళముగానున్నది.

**ఆరాధన : శ్రీ ముప్పగాని నాగేంద్రగౌడు, కళ్యాణదుర్గము.**

ఈ ఖండకావ్య సంపుటిలో ఎనిమిది శీర్షికలుకలవు. ఇవి పాఠకులలో కళాపిపాసను పెంపుజేస్తూ, ఉత్తమ ఆదర్శలక్ష్యాలను ప్రబోధించు కవితాపుష్టిని కలిగియున్నవి. మహిళామణుల దేశభక్తికి దోహద మిచ్చే 'జోహార్లు,' సాహితీ కుమారుడు భిక్షమర్తించెడు 'తెలుగుతల్లి' 'ఆత్మార్పణము,' 'అస్త్రసన్యాసము 'శాంతిదూత' యీ గ్రంథమునకు ఎంతైనా రాణింపునిచ్చుచున్నవి. అక్కడక్కడ లోటుపాట్లున్నా అభ్యుదయ కవికాబట్టి ప్రోత్సహించతగిన దీసంపుటి.

**శ్రీతులసీ మహిమామృతము : అనువాదం - శ్రీ దాన శేషుడు. ప్రకాశకులు : సాధన గ్రంథమండలి, తెనాలి. వెల రు 1 - 50.**

ప్రజలచే నారాధించబడు చెట్లలో తులసియొకటి. ప్రతిహిందూగృహమునకు తులసి గృహదేవత. ఇట్టి తులసీ మహాత్మ్యమును వివిధపురాణములు, వేదములు, శాస్త్రములు వివరించుచున్నవి. తులసి దర్శనము, ఆరాధనార్చనలు సర్వపాపక్షయ కారణములేకాక సర్వకామ్యముల సిద్ధికి కారణములు. ముఖ్యంగా స్త్రీల సౌభాగ్యమునకు తులసినామస్మరణ, సంకీర్తనము, పూజ పట్టుకొమ్మలాంటివి.

వివిధ పురాణాది గ్రంథములనుండి సేకరించి శ్రీ శ్రీ సీతారామదాస ఓంకారనాథజీ తులసీమహిమ, ఉత్పత్తి, అర్చనావిధానము, తులసీ కళ్యాణము యిత్యాది విషయములను బెంగాలీభాషలో గ్రంథముగా రూపొందించిరి. దాని కీగ్రంథము ఆంధ్రానువాదము. ఇది ప్రతియొక్క హిందూ గృహమున నుండదగినది.

**ఏకాంతవాసి : శ్రీ చర్ల సత్యనారాయణ, తెలుగు పండితుడు, జమీందారు నూలి వెంకటరత్నం హైస్కూలు, పెనుగొండ, ప. గోదావరిజిల్లా. వెల 0 - 87**

ఇది గోల్డుస్మిత్ యొక్క ఆంగ్ల రచన 'హెర్మిట్'కు స్వేచ్ఛానువాదము. మనోజ్ఞమైన శైలిలో మనసిత భావాలతో రూపొందిన యీ పద్యకావ్యము ముచ్చటగా నున్నది.

# సంపాదకీయములు

## సానుభూతి సంతాపాలు

జాతీయ సమరంలో వీరోచితంగా పోరాడి అఖండత్యాగాలు చేసిన స్వార్థరహితుల నేకులుగలరు. వారికి పదవులు లభించకపోవచ్చు; దరిద్రులుగానే నిలబడిపోయియుండవచ్చు. అయినా వారి చిత్త శుద్ధి, సేవాసక్తి, ఉత్తమ ఆదర్శలక్ష్యాలపట్ల ఆసక్తి, వారి ఆత్మ, పరమాత్మలకు ప్రీతిపాత్రమై వారు ధన్యుల య్యారు. అట్టి వారిలో శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారొకరు.

జాతీయ సమరంలోనేమి, జాతీయ పునర్నిర్మాణ కార్యకలాపాలలోనేమి, గాంధీజీ సిద్ధాంతముల ననుసరించి ముందడుగు వేయడమేకాక ప్రజలలో చైతన్యమును, దేశభక్తిని, సంఘసంస్కారముపట్ల ఆసక్తిని పూరించి ముందుకు నడిపిననాయకుడు శ్రీ లక్ష్మీనారాయణగారు.

ఆయన 'మాలపల్లె' రచన సాహిత్యరంగంలో ఉత్తమశ్రేణినందుకున్నదేకాక హరిజనోద్యమవ్యాప్తికి విశేషంగా తోడ్పడింది. శ్రీ లక్ష్మీనారాయణ దంపతులు స్థాపించి నిర్వహించిన శారదానికేతనము అనేక మంది వితంతువుల, అనాథల జీవితాలు పతనావస్థనుండి ఉద్ధరింపబడటానికి, సౌభాగ్యవిలసితములు కావడానికి వినియోగపడినది.

ఆంధ్ర రాష్ట్రోద్యమానికి, విశాలాంధ్రనిర్మాణానికి పునాదులు వేసి, కృషిచేసిన మూలపురుషులలో శ్రీ లక్ష్మీనారాయణగారొకరు.

వీరి మరణము చాల విచారకరమయినదేకాక దేశానికి తీరనిలోటును కలిగించినది.

ఇదే సందర్భమున సుప్రసిద్ధకవయిత్రి, గృహలక్ష్మి స్వర్ణకంకణ గృహీత శ్రీమతి కాంచనపల్లి కనకాంబగారు పరమపదించుట మాకు చాల విచారకారణమయినది. ఆమె విద్వత్కవితా పాండిత్యములు అనేకమంది కవయిత్రులను, రచయిత్రులను ప్రోత్సహించుటయేకాక ఆమె పేరు సారస్వత రంగంలో పదిలమయిపోయింది.

వీరిరువురి నిర్యాణముపట్ల మా విచారమును తెలుపుచు భగవంతుడు వీరి ఆత్మలకు పరిపూర్ణ శాంతిని కలుగచేయుగాకయని ప్రార్థిస్తున్నాము.

## విద్యార్థులకు తప్పనిసరిగా సంఘసేవాశిక్షణ

విద్యార్థులకు యూనివర్సిటీ డిగ్రీ అందుకునేముందు హైస్కూలు విద్యాభ్యాసమో, హయ్యర్ సెకండరీ విద్యాస్థాయియో ముగియగానే తప్పనిసరిగా సంఘసేవాశిక్షణను ఏర్పాటుచేసే విషయమునకు గల అవకాశములను కేంద్రమంత్రివర్గము ప్రధాని నెహ్రూ సూచన ననుసరించి అఖిలభారత స్థాయిలో పరిశీలించుచున్నదట.

ఈ విషయము అభినందనీయము. సంఘసేవాశిక్షణ విద్యార్థుల భవిష్యత్ జీవితములలో స్వీయ పురోభివృద్ధికి అవసరమయిన ఓర్పును, సేవాసక్తిని, పరస్పర ప్రేమ సద్భావసహకారములను, దీక్షా త్యాగాలను పెంపుచేయగలవు. వీనితోబాటు క్రమశిక్షణ, నైతికస్థాయి సయితము మెరుగుకాగలవు.

కేంద్రమంత్రివర్గము తెలపెట్టిన యీ సంఘసేవా శిక్షణ విధానము అన్నివిధముల జాతీయ శ్రేయస్సుకు తోడ్పడగలదు.

## నర్సింగ్ శిక్షణను స్త్రీలకు ప్రత్యేకించడం మంచిది!

నర్సులుగా పనిచేయడానికి స్త్రీలే యోగ్యులనియు, వారికే మాతృహృదయం, సౌహార్ద్రభావము వ్యాధిగ్రస్తులపట్ల యుండుననియు భారతశిక్షణపొందిన నర్సుల సంఘం స్వర్ణోత్సవమును ప్రారంభిస్తూ శ్రీ నీలం సంజీవరెడ్డిగారు చెప్పారు.

నర్సులుగా పనిచేయడం మానవసేవ జేయడానికి మహదావకాశమేకాక సుఖజీవనానికికూడ మార్గము. స్త్రీలు కష్టమైన వృత్తులు, బరువులు మోయడమో, గనులు, ఫ్యాక్టరీలలో పనిచేయడమూకంటె నర్సులుగా వృత్తిస్వీకరించడము ఏవిధంగాను తీసిపోదు. నర్సులుగా పనిచేయడానికి వలసిన ఓర్పు, ప్రేమ, త్యాగసేవా సక్తి అత్యవసరములు. విశేషంగా స్త్రీకి సహజంగా కలవవి. కాబట్టి నర్సింగ్ శిక్షణను స్త్రీలకు ప్రత్యే కించడం మంచిది. శిక్షణపొందడానికి, నర్సులుగా వృత్తి స్వీకరించడానికి అవకాశాలను ఆకర్షణీయంగాచేసి ప్రోత్సహించవలసియున్నది.

## శాంతిదూత పోప్ పయస్ XII నిర్యాణం

ప్రపంచ రోమన్ కాతలిక్ చర్చి పీఠాధిపతి పోప్ పయస్ నిర్యాణము ప్రపంచమున కెంతైనా లోటును కలిగించింది.

ఆయన దివ్యమూర్తి, శాంతిదూత, దూరదృష్టిగల మేధావికూడాను. ఆయన ప్రస్తుత కల్లోల ప్రపంచానికి శాంతి, సుహృద్భావ సందేశాలను నిరంతరము పూరిస్తూ ప్రేమ, భక్తి, పారమార్థిక చింతలను ప్రజలలో పెంపుచేయడానికి నిర్విరామంగా కృషిచేసిన పుణ్యమూర్తి. భగవంతుడు యీయనకు పరమపదంతో బాటు ఆత్మశాంతిని ప్రసాదించుగాక!

## మతలక్ష్యాలు సేవాత్యాగాలయి యుండాలి!

ఏమతమయినా సాంఘికవ్యవస్థ పదిలంకావడంకొరకు ఏర్పడినదే. సాంఘికవ్యవస్థ పదిలంకావాలంటే మతం మానవులలో సేవాత్యాగాలను పూరిస్తూ మానవ జీవయాత్రను క్రమబద్ధంగా, నీతినియమాలతో రూపొందించునది కావాలి. మతలక్ష్యాలు అట్టివైననాడే అభివృద్ధి అభ్యుదయాలతోబాటు ముక్తి సాఫల్యము సయితము సిద్ధించగలదు.

ఏమతమయినా పరస్పర స్పర్థలను, వైషమ్యాలను, అనైక్యతను ప్రోత్సహించగలదైనచో ప్రజలు శాంతియుత సహజీవనాని కనువుగా మార్పులుచేసికొని యావత్ప్రజానీకము ఆత్మ, పరమాత్మలనరసి, సానిధ్యమును కోరవలసియున్నది.

—o—

## శ్రీ విళంబినామ సం॥ర ఆశ్వయుజ, కార్తీకమాసములు

| | | | |
|---|---|---|---|
| 1958 సం॥ అక్టోబరు నెల | 16 | గు | చవి 28–24 అనూ 27–7 లలితాగౌరీవ్రతం |
| | 17 | శు | పం 23–48 జ్యే 24–9 |
| | 18 | శ | ష 19–46 మూల 21–57 తిథిద్వయం సరస్వతిపూజ |
| | 19 | ఆ | సప్త 16–45 పూషా 20–43 |
| | 20 | సో | అష్ట 14–46 ఉషా 20–21 దుర్గాష్టమి, ఆయుధపూజ |
| | 21 | మం | న 14–0 శ్రవ 21–18 |
| | 22 | బు | ద 14–20 ధని 23–27 దశరథ గౌరీవ్రతం, విజయదశమి |
| | 23 | గు | ఏ 16–20 శత 26–50 |
| | 24 | శు | ద్వా 18–58 పూభా 31–21 శూన్యతిథి |
| | 25 | శ | త్ర 23–25 ఉభా 36–47 |
| | 26 | ఆ | చతు 28–59 రేవ 43–4 |
| | 27 | సో | ○ పౌ 33–34 అశ్వ 49–30 |
| | 28 | మం | కృపా 38–51 భర 56–2 |
| | 29 | బు | విది 43–43 కృ 60–0 |
| | 30 | గు | తది 47–47 కృ 1–51 |
| | 31 | శు | చవి 50–27 రో 6–30 |
| 1958 సం॥ నవంబరు నెల | 1 | శ | పం 52–33 మృగ 10–55 |
| | 2 | ఆ | ష 53–8 ఆర్ద్రా 13–43 |
| | 3 | సో | సప్త 52–11 పున 15–21 |
| | 4 | మం | అష్ట 50–5 పుష్య 15–35 |
| | 5 | బు | న 46–59 ఆశ్రే 14–43 |
| | 6 | గు | ద 42–47 మఘ 12–51 |
| | 7 | శు | ఏకా 37–51 పుబ్బ 10–11 |
| | 8 | శ | ద్వా 32–25 ఉత్త 6–49 |
| | 9 | ఆ | త్ర 26–42 హస్త 2–58 చిత్త 55–54 మాసశివరాత్రి |
| | 10 | సో | చతు 20–46 స్వాతి 54–36 దీపావళి అమావాశ్య |
| | 11 | మం | ● అమా 14–49 విశా 50–25 కేదారవ్రతం |
| | | | **కార్తీక మాసము** |
| | 12 | బు | శుపా 9–12 అనూ 46–50 అఖండదీపారంభం |
| | 13 | గు | విది 3–46 ఏష్యం 55–6 జ్యే 43–37 |
| | 14 | శు | చవి 44–54 మూల 41–11 |
| | 15 | శ | పం 52–3 పూషా 39–42 |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press,
Kesari Kuteeran (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras
Ag. Editor : C. C. Punniah.

